# ప్రపంచవీరులు

## మొదటిభాగము



గ్రంథకర్త

## గోపరాజు వెంకటానందం




నమ్మాళ్వార్స్

జార్జిటవును, మదరాసు

వెల ఎనిమిది అణాలు.

# NAMMALWARS' PUBLICATIONS.

*'Triveni' dated 3rd August 1939, writes as follows :—*

" Since the day when K. V. Lakshmanarow and Dr. A. Lakshmipathi started the Vignana-chandrika series, several attempts have been made to bring out useful books in Telugu. Mr. Nammalwar has succeeded where many others failed, for in addition to being student of Telugu literature, he is a capable business man. He studies the tastes of the public, plans his books wtth foresight, publishes them in rapid succession, and prices them low even whild maintaining a certain standard of print and get up. The series covers a wide range—politics, history, poetry, drama and the short, and every theme.

"Here is a praiseworthy attempt to bring modern knowledge to our doors in an attractive garb. Mr. Nammalwar has set his task in right earnest and he deserves to be warmly congralated."

**K. Ramakotiswara Rau.**

---

**NAMMALWARS — PUBLISHERS — G. T., MADRAS.**

---


*1st Edition—1938, 1000 copies.*
*2nd „ —1941, 500 copies.*

1

# కారల్ మార్క్సు

కారల్ మార్క్సు జీవితము నొక్కసారి పరికించినచో ఎట్టి పాషాణహృదయమందైనను దేశభక్తి, ఉత్సాహము, సామ్రాజ్యతత్వనిరసన పుట్టకమానవు. ఒక సుప్రసిద్ధ న్యాయవాది యగు ధనవంతునకు పుట్టి, సర్వస్వమును తన మాతృదేశమునకు ధారపోసి, తిండికికూడ ఏమియులేక ఉపవాసములు చేయునంతటి దరిద్రావస్థను పొంది, ప్రపంచ పరిణామమున నొక నూతన పరివర్తనమునకు సృష్టికర్తయై, జగద్విఖ్యాతి గాంచిన మార్క్సుయొక్క జీవితమును చదివిన ప్రతిమానవునకు దేహము పులకరించకమానదు.

కారల్ మార్క్సు ప్రష్యాదేశములోని రైన్ రాష్ట్రములో ట్రియర్ అను పట్టణమున ౧౮౧౮ మే ౫-వ తేదీని జన్మించెను. ఈతని పూర్తిపేరు “కారల్ హీన్‌రిచ్ మార్క్సు”. తండ్రి న్యాయవాది. ధనసంపాదన బాగుగ చేయుచుండెను. ఈవంశమువారు ధనవంతులు విద్యాసంస్కారులుగా నుండెడివారు గాని విప్లవవాదులు కానేకారు. మార్క్సు “ట్రియరు” పట్టణములోని ఉన్నతకళాశాలయందు విద్య పూర్తిగావించి పిమ్మట “బాన్” విద్యాలయములోను, “బెర్లిన్” విశ్వవిద్యాలయములోను న్యాయశాస్త్రము నభ్యసించెను. ఈతడు మొదటనుండియు చరిత్రలను, వేదాంతశాస్త్రములను చదువుటయందు తనకాలమును వినియోగపరచెను. ౧౮౪౧-వ సంవత్సరమున మార్క్సు తనవిద్యను పూర్తిగావించి, “ఎపిక్యూరస్” తత్వసిద్ధాంతములపై నొక విమర్శనాగ్రంథమును రచించి, రానున్న డాక్టరు బిరుద

మును గోల్పోయెను. అప్పటికే మార్క్సుహృదయములో విప్లవ బీజములు నాటుకొని మొలకలెత్తసాగెను. ఆనాటికి, హెగిల్ యొక్క భావవాదమును అవలంబించిన హేగిలియనులలో అతివాదులగు బ్రూనో బూయర్ మొదలగు వారితో, మార్క్సు పూర్తిగా ఏకీభవించెడివాడు. ఈ అతివాదులందరును హెగిల్ తత్వమునుండి నాస్తిక, విప్లవవాదములను నిర్ణయించుచుండిరి.

విశ్వవిద్యాలయమునుండి బయటకు వచ్చిన తరువాత తనజీవితమును ఉపాధ్యాయుడుగా గడుపయత్నించి "బాన్" పట్టణమునకు వచ్చెను. అచ్చట ప్రభుత్వము చాలా కాఠిన్యము వహించి ప్రొఫెసరులను, ప్రిన్సిపాలులనుకూడ ఎక్కువ నిర్బంధించుచుండెడిది. ఇంతటి కాఠిన్యమును, నైచ్యమును అవలంబించుచున్న ప్రభుత్వమున స్వతంత్రభావపూరితుడగు మార్క్సువంటి వానికి తావు దొరకుటయు, ఒకచో దొరికిన యది నిలుచుటయు దుస్సాధ్యమే. కావున మార్క్సు ఈ ఆశలను విడిచిపెట్టవలసివచ్చెను.

అప్పటినుండియు మార్క్సు తనజీవితమును రాజకీయవిలేఖరిగా గడిపెను. ౧౮౪౧ లో చదువును ముగించగనే, మార్క్సు ప్రభుత్వపద్ధతుల నెదిరించుచు "రేనిష్ గజిట్" అను నొక పత్రికకు ప్రధాన సంపాదకుడుగా నుండెను. కాని ఆ పత్రికయందు విప్లవోద్దేశ్యములను గురించి ఎక్కువగా వ్రాయుటచే ౧౮౪౩ ఏప్రిల్ ౧-వ తేది నాటికే ప్రభుత్వమువారద్దానిని నిషేధించిరి. మార్క్సు ఈపత్రికాసంపాదకత్వమువలన అర్థశాస్త్రము (Political Economy) గురించి ఎక్కువ జ్ఞానమును, అనుభవమును సంపాదించగలిగెను.

మార్క్సు క్రూజ్‌నాచ్ నగరములో నిరంకుశప్రభు కుటుంబమునకు జెందిన "జెన్నివాన్ వెస్టుఫాలెన్" అను యువతిని ౧౮౪౩-వ

సంవత్సరమున పెండ్లాడెను. ఆ సంవత్సరముననే అతివాది యగు ఆర్నాల్డురూజ్ అనునతనితో కలిసి పారిస్‌నుండి "జర్మనీ - ఫ్రెంచి అనాల్స్" అను నొక పత్రికను నడుపసాగెను. కాని అడుగులోనే హంసపాదమన్నట్లు రూజ్‌తో భేదాభిప్రాయములు వచ్చుటచే నొక సంచిక మాత్రమే వెలువడి ఆగిపోయెను. ఈ పత్రికలను జర్మనీలో రహస్యముగా పంచిపెట్టవలసి వచ్చెను. ఈ పత్రికలోని ఈతని వ్యాసములను చూచిన అప్పటికే మార్క్స్ తీవ్రవాదిగానున్నట్లు తెలిసికొనవచ్చును. ఆచరణలోనున్న ప్రతిదానిని నిర్దాక్షిణ్యముగా విమర్శించుచు, ముఖ్యముగ ఆయుధములనుగురించి కఠినముగా విమర్శించుచు, ఏటి నెదిరించుడని సామాన్యప్రజలకును, పరిశ్రామికవర్గమునకును ప్రబోధ మొనరించుట వాటిలో స్పష్టముగా కనబడును.

౧౮౪౪ సం॥ సెప్టెంబరునెలలో ఫ్రెడరిక్ యేంగిల్సు కొద్దిరోజు లుండుటకై పారిస్‌నకు వచ్చెను. అప్పటినుండియు జీవితాంతము వరకును మార్క్స్ యేంగిల్సు యిరువురును ప్రాణస్నేహితులుగా నుండిరి. పారిస్‌లోని విప్లవసంఘములతో కలిసి వీరిద్దరును చురుకుగా పనిచేయుచుండిరి. ౧౮౪౫-వ సంవత్సరములో ప్రష్యన్ ప్రభుత్వము ఈతని విప్లవకారునిగా పరిగణించి పారిస్‌నుండి వెడలగొట్టెను. ౧౮౪౭ లో మార్క్స్ "Poverty of Philosophy" అను ఒక పుస్తకమును వ్రాసెను. ఈ పుస్తకమునే జగద్విఖ్యాతిగాంచిన 'కమ్యూనిజమ్' 'మార్క్సిజమ్' అని అందురు. మార్క్స్ అచ్చటనుంచి తన నివాసమును "బ్రసెల్సు" నగరమునకు మార్చెను. ౧౮౪౭ సం॥లో మార్క్స్ యేంగిల్సులు "కమ్యూనిస్టు సమితి" అను ఒక రహస్య విప్లవ సంఘములో సభ్యులుగా చేరిరి. ఆ సమితియొక్క రెండవ సమావేశము (Congress) ౧౮౪౭ సంవత్సరము నవంబరునెలలో లండనునగరములో జరిగినప్పుడు అచ్చటి కార్యక్రమములో వీరిదరు ముఖ్యపాత్రధారు లై

నడుపసాగిరి. ఈ కమ్యూనిస్టుసమితి తరపుననే మార్క్సు ఏంగిల్సులు యిద్దరును కలసి జగత్ప్రసిద్ధిగాంచిన కమ్యూనిస్టు "మానిఫెస్టో"ను తయారుచేసి, ౧౮౪౮ ఫిబ్రవరిలో ప్రకటించిరి. దానిఫలితముగ బయలుదేరిన విప్లవమువలన మార్క్సును "బ్రసెల్సు" నుండి తరిమివైచిరి. మార్క్సు బ్రసెల్సునుండి పారిస్‌నకు తిరిగివచ్చి ఫ్రాన్సులో మార్చి విప్లవము జరిగినతరువాత అచ్చటనుండి జర్మనీలోని "కొలోన్" నగరమునకు చేరెను. ౧౮౪౮ జూన్ ౧-వ తేదీనుండి ౧౮౪౯ మే ౧౯-వ తేదీవరకును మార్క్సు సంపాదకత్వమున కొలోన్‌నుండి "న్యూరెనిష్ గజెట్" అను పత్రిక వెలువడెను. తరువాత యావత్ ప్రపంచములోను జరిగిన శ్రామికవర్గ (Proletarian) ప్రజాతంత్ర (Democratic) ఉద్యమములు ఏ విధముగా ఈ నూతనసిద్ధాంతము లాచరణయోగ్యములని నిరూపించినవో, ఆ విధముగనే ౧౮౪౮-౧౮౪౯ సంవత్సరముల మధ్య జరిగిన విప్లవసంఘటనలుకూడ వీటికి నిదర్శనములైనవి. జర్మనీలో విప్లవము నణచివేసిరి. ప్రభుత్వము మార్క్సును విచారించి కారాగార శిక్షను విధించెను. కాని ౧౮౪౯ ఫిబ్రవరి ౯-వ తేదిని విడిచిపెట్టి మే ౧౬-వ తేదిని మార్క్సును జర్మనీదేశమునుండి వెడలగొట్టిరి. అక్కడనుండి మార్క్సు పారిస్‌నకు బోయెను. కాని ౧౮౪౯ జూను ౧౩-వ తేదిని జరిగిన ప్రదర్శనముల (Demonstrations) తరువాత అచ్చటనుండికూడ వెళ్లగొట్టబడి, యీ నిత్యప్రవాసి లండనుకుపోయి జీవితాంతమువరకు అచ్చటనే యుండెను.

మార్క్సు యేంగిల్సుల కెల్లప్పుడు నుత్తరప్రత్యుత్తరములు జరుగుచుండెడివి. ౧౯౧౩ లో ప్రకటించిన వాటినిబట్టి జూడ ప్రవాసుల జీవిత మెంత దుర్భరమో తెలుసుకొనగలము. మార్క్సు కుటుంబమును దుర్భర దారిద్ర్యము పీడింప నారంభించెను. ఆ రోజులలో తన ప్రాణమిత్రుడైన యేంగిల్సు స్వార్థముత్యజించి ఈతనికి ధనసహాయమే చేసి

యుండనిచో మార్క్సు "కాపిటల్" (Capital) అను పుస్తకమును పూర్తి చేయలేక పోవుటయేగాక లేమితో క్రుంగి నాశనమై యుండెడి వాడు. మార్క్సు అనేకులు వ్రాసిన వ్యాసములను ఖండించుటయేగాక అనేకులగు వ్యక్తులనుకూడ నిర్దాక్షిణ్యముగను, నిర్భయముగను విమర్శించెడివాడు. మార్క్సు యితర ప్రవాసులతో కలిసిమెలిసి యుండక తన కాలమునంతను ఆర్థిక శాస్త్రపఠనమునందే వినియోగపరచుచు భౌతిక వాదమును (Materialism) అనేకవిధముల బలపరచుచుండెను. మార్క్సు ఆర్థికశాస్త్రమునందు (Political Ecomomy) గొప్ప విప్లవమును తీసికొనివచ్చెను. ఈ విషయము మార్క్సుచే వ్రాయబడిన "ఆర్థిక సమస్య" అను శీర్షికక్రింద "కాపిటల్" అను గ్రంథములో చూడగలము.

౧౮౫౯-'౬౪ సంవత్సరములమధ్య యూరప్‌నందంతటను తిరిగి ప్రజాతంత్ర ఉద్యమములు తలెత్తసాగెను. వెంటనే మార్క్సు రాజకీయరంగమున కరిగి ౧౮౬౪ సెప్టంబరు ౨౮-వ తేదిని లండన్‌నగరమందు "ప్రథమ అంతర్జాతీయ కార్మికసంఘము" (The International Working Men's Association) స్థాపించెను. ఇదియే సుప్రసిద్ధమగు "ఫస్టు ఇంటర్‌నేషనల్," ఈ సంస్థకు మార్క్సు గుండెకాయవంటివాడు. దాని తరపున ప్రకటించిన కార్యక్రమమేగాక ప్రపంచమందలి వివిధదేశముల కూలీలయొక్క "శ్రామిక పోరాటము"లకు అనుకూలమగునట్లుగా మార్క్సు ఒకే గొప్ప కార్యక్రమమును తయారుచేసెను. ౧౮౭౧-వ సంవత్సరమున "పారిసు కమ్యూన్" (కార్మికసభ) భగ్నమైనది. అందులకుగల కారణములను మార్క్సు విశదముగా "ఫ్రాంసుదేశములోని అంతర్యుద్ధము ౧౮౭౧" అను గ్రంథమున పొందుపరచెను. "పారిసు కమ్యూన్" భగ్నమైపోయి, "ఇంటర్‌నేషనల్"లో తీవ్రభేదములు కలిగినపిదప, ౧౮౭౨ లో

"హేగ్"లో "ఇంటర్ నేషనల్" జరిగెను. ఆ సభయందు "ఇంటర్ నేషనల్" యొక్క "కేంద్రసంఘము" యూరప్‌లో నుంచుటకు వీలులేదనియు న్యూయార్కునకు మార్చవలయుననియు మార్క్సు చెప్పి, ఆ తీర్మానమును నెగ్గించెను. అప్పటినుండియు ప్రపంచమునందంతను కార్మికోద్యమము కార్చిచ్చులాగున చెలరేగినది. జాతీయ ప్రభుత్వము గల ప్రతిదేశములోను ప్రజాసామాన్యములో సోషలిస్టు కార్మికపక్షము లేర్పడినవి. కార్మికోద్యమము అంతకంతకు వృద్ధిపొందసాగెను.

కారల్ మార్క్సు జీవితములో సుఖశాంతులను నవి లేనేలేవు. మార్క్సు దంపతులు అనేకమగు ఆపదలను అనుభవింపవలసి వచ్చెను. ౧౮౪౯ లో 'రెనిష్ గెజెట్' బహిష్కరింపబడిన తరువాత మార్క్సు దారిద్ర్య దేవతతో తీవ్రముగా పోరాడవలసి వచ్చెను. వాటి అనుభవము లను కొన్నిటిని ఈయన భార్య పుస్తకరూపమున రచియించినది. ఒక చోట ఇట్లు వ్రాసినది.

"మేము పారిసులో ఉన్నప్పుడు ఒక నెలవరకు మాకు ఆశ్రయమే దొరకుట చాల కష్టమాయెను. ఒకరోజున ప్రాతఃకాలమున భయంకరాకారము గల ఒక సార్జెంటువచ్చి 24 గంటలలో పారిసు నుంచి వెళ్లవలెనని ఆజ్ఞాపించెను. ఇంటిలోనున్న స్వల్పసామాగ్రితో మేము లండను ప్రయాణమైతిమి."

మార్క్సుజీవితమును వ్రాసిన జె. స్పార అనునతడు "మార్క్సు లండనుయాత్ర—దరిద్రదేవతాహ్వాన" మని వ్రాసినాడు. అప్పుడప్పుడు మార్క్సుదంపతులు తమ భాగపు రొట్టెలను తమ పిల్లల కిచ్చి తాము పస్తుండెడివారు. ఆకలిచే పీడింపబడినప్పటికిని మార్క్సు లండను లోని బ్రిటిష్ మ్యూజియమ్‌కు వెళ్లి పఠితికాపఠనమును చేయుచుండెడి వాడు. అప్పటిలో పత్రికలకు వ్యాసములువ్రాసి తనజీవితమును

గడుపవలసి వచ్చినది. దరిద్రతా విముక్తికొకసారి రైల్వేడిపార్టుమెంటులో ఒక గుమాస్తా పదవికి అప్లికేషను పెట్టుకొనగా, దస్తూరి బాగుగా లేనికారణముచే అప్లికేషను త్రోసివేసిరి. ప్రభుత్వము "రేనిష్ గెజెటు"ను బహిష్కరించుటవల్ల మార్క్సువద్ద నున్న డబ్బంతయు, ప్రెస్‌లోని ఉద్యోగస్థులకు ఖర్చు అయినది. తనవద్ద డబ్బులేక భార్యవద్దనున్న వెండిసామానును అమ్మవలసివచ్చెను. లండనులో ఉన్న బాకీలను తీర్చుటకు చాల భాగము తన సామానును అమ్మివేసెను. ఈ కాలమున మార్క్సునకు ముగ్గురుబిడ్డలు. భార్యగర్భిణి. ఈ పరిస్థితులలో వీరున్న యింటియజమాని వచ్చి అద్దెకై వత్తిడిచేసి, ఇల్లు ఖాళీ చేయమనెను. సామానంతయు బయటకు లాగివేసెను. మార్క్సువద్ద ఒక్కపైసకూడ లేనికారణముచే ఇంటిలోనుంచి వెళ్లిపోవలసి వచ్చెను. ప్రపంచవిఖ్యాతి చెందిన మార్క్సు ఆరోజున వర్షములోను చలిలోను—గర్భిణి అగు భార్యతో, తన ముగ్గురబాలురతో బయటికి వెళ్లి పోవలసి వచ్చెను. ఒక బండి కట్టించుకొని గదిని వెదకుటకు బయలుదేరెను. మార్క్సు దుఃఖముతోను, దారిద్ర్యముతోను, బాధపడుచున్నప్పటికి అధైర్యుడు గాక ఎల్లప్పుడును బీదల సేవనే తన ధర్మముగా తలచి, ఒక్కపైసకూడ తీసికొనకుండ, కూలీల సభలో ఉపన్యసించెడివాడు.

ధర్మపత్నియును, తోడునీడయును, కుడిభుజమును యగు ఈతనిభార్య ౧౮౮౧ డిశంబరు ౨-వ తేదీని మరణించెను. భార్యావియోగమువల్ల దుఃఖితుడైన మార్క్సు పడకకుర్చీలో పడుకొని, ఈ ప్రపంచమును వీడి ౧౮౮౩ మార్చి ౧౪-వ తేదీన పరలోక యాత్ర చేసెను. ఇతని శవమును, లండనులోని "హైగేట్ సిమెటరీలో"లో ఇతని ప్రియభార్యయొక్క సమాధి ప్రక్కనే సమాధి చేసిరి.

ఈ వీరాత్ములు రెండును పూంజీవాదముతో యుద్ధము చేయుచు సామ్యవాదప్రచారమునకు అనేక విధముల తోడ్పడినవి. ప్రపంచములో సామ్యవాద మనుపేరున్నంతవరకు ప్రజలు అతిశ్రద్ధతో, ప్రేమతో కారల్ మార్క్సు దంపతులనామములు తలచుచునే యుందురు.

---

## లెనిన్

"లెనిన్ రష్యనులకు విప్లవమనే సందేశము నిచ్చి సోవియట్‌ను స్థాపించగలిగాడు. లెనిన్ స్థాపించిన ఈ సోవియట్ వల్ల దేశములో ఆకలిబాధ, నిరుద్యోగము నశించుననుటకు ఏమియు సందియము లేదు." —డా. సన్‌యత్ సేను.

సోవియట్ రష్యా ప్రజాస్వామికమునకు, అంతర్జాతీయ కార్మికోద్యమమునకు మూలపురుషుడును, ౧౯౧౭-వ సంవత్సరము అక్టోబరు నెలలో రష్యాదేశమునందు జరిగిన విప్లవమునకు నాయకుడును, నేటి రష్యాప్రధాననిర్మాతయును, సోవియట్ రాజ్యాంగ ప్రథమనియంతయు నగు లెనిన్ మహాశయుని పేరు వినని వారుండరు.

నిరంకుశపరిపాలకులనుండి బాధితులగు ప్రజల నుద్ధరింప ప్రతి యుగమునందును ఎవరో ఒకరు అవతారపురుషులవలె వెలసి ప్రజలను రక్షించి దేశాభివృద్ధికి తోడ్పడుచుందురు. సామ్రాజ్యకాంక్షులును, యుక్తియుక్తులును, హిందూదేశపాలకులు నగు యీ బ్రిటిషువారినుండి, శతాబ్దములనుండి బానిసత్వమున బాధపడుచున్న ఐర్లాండుదేశము నుద్ధరింపడీవెలరా అవతరించి స్వదేశపుశ బానిసతనమును రూపుమాపి, సం

పూర్ణ స్వాతంత్ర్యమును స్థాపించెను. సమస్త సంపదలకును పుట్టినిల్లై విరాజిల్లుచున్న భారతదేశము నుద్ధరింప శ్రీ మహాత్మా గాంధీ, నెహ్రూ మొదలగువారు జన్మించిరి. ముస్తఫా కెమాల్ పాషా టర్కీ దేశము నుద్ధరించి తురుష్క జాతీయోద్ధారకుడయ్యెను. అటులనే నేటి సోవియట్ రష్యాను నిర్మింప లెనిన్ మహాశయుడు అవతరించెను.

లెనిన్ మహాశయుడు ౧౮౭౦ సం॥ ఏప్రియల్ ౨౨-వ తారీఖున "సిమ్‌బిరస్క్" అను గ్రామమునందు జన్మించెను. ఈయన తల్లిదండ్రులు సామాన్య కుటుంబీకులు. తల్లి ఒక డాక్టరుకూతురు. తండ్రి రష్యా ప్రభుత్వమందు విద్యాశాఖలో పనిచేయుచు తన సంసారమును పోషించుకొనుచుండెను. ఈయనకు ఇద్దరు కుమారులు, నలుగురు కుమార్తెలు గలరు. లెనిన్ సోదరుడగు అలెగ్జాండరు బీదప్రజలయొక్క దుస్థితిని చూచి వారియొక్క భావిభాగ్యోదయమునకై పాటుపడుచుండెను. రష్యాచక్రవర్తియగుజారు ప్రభుత్వమును తుదముట్టింప వలెనని ప్రయత్నించినాడని ఈయనపై నేరారోపణచేసి ౧౮౮౧ లో ఉరితీసిరి. ఈ సంఘటన లెనిన్ జీవితములో మహత్తరమైన మార్పును గలిగించి, యాతని భవిష్యత్తునకు దారిచూపినది. తనసోదరుని ఉరితీసినందుకుగాను జారుప్రభుత్వమును కూలద్రోయుట తనవిధ్యుక్తమని తలచి లెనిన్ మరింత తీవ్రముగా పనిచేసెను.

లెనిన్ అసలుపేరు 'లాడిమిర్ యూలిచ్', లెనిన్ అనుపేరు ఈయన యౌవనదశలో వచ్చిన మారుపేరు. లెనిన్ చిన్నప్పటినుంచి ఎక్కువ తెలివితేటలుగలిగి, అన్నగారివలెనే రాజకీయములలో పాల్గొనుచు, ఎల్లప్పుడు కష్టజీవుల భావిభాగ్యోదయమునుగురించి ఆలోచించుచుండెను. సంఘమున బయలుదేరు దురాచారములను నశింపు జేయుటయు, ప్రభుత్వనిరంకుశత్వమును నిర్మూలించుటయు ఈయన కార్యక్రమములో ముఖ్యాంశములు.

తన చదువును ౧౮౮౭ నాటికే పూర్తిచేసి న్యాయశాస్త్రము చదువుటకు "కజాన్" విశ్వ విద్యాలయమునందు చేరెను. కాని కొలదిరోజులకే, లెనిన్ రాజకీయములలో పాల్గొనుటను జూచి, రాజద్రోహ నేరముక్రింద విశ్వ విద్యాయలమునుండి ఈతనిని వెడలుగొట్టిరి. అందుచే ౧౮౮౯ వరకు తిరిగి విశ్వవిద్యాలయములో ప్రవేశింపలేక పోయెను. ఈతడాసమయమందు "కారల్ మార్క్సు" గ్రంథములను చదువుచుండెడివాడు. తన అన్న చేయ సమకట్టిన కార్యమును తాను "కారల్ మార్క్సు" సిద్ధాంతములవల్లనే చేయగలుగుదునని గట్టి నమ్మకమును గలిగి ఆసిద్ధాంతములను అమలులోనికి తీసుకొనివచ్చి వాటివలననే ప్రపంచము నుద్ధరించవలెనని తలచెడివాడు.

లెనిన్ రాజకీయములలో ముఖ్యపాత్ర వహించుచున్నప్పటికిని ఈతనిదృష్టి చదువునుండి మరలలేదు. 'కజాను' యూనివర్సిటీని వదలి పిమ్మట పీటర్సుబర్గులో చేరి ౧౮౯౧ సంవత్సరమున లా (Law) డిగ్రీని పొందగల్గెను. తదుపరి "సమరాయన" పట్టణమున ప్లీడరీవృత్తి నవలంబించెను. కాని ఈ పనియందు లెనిన్‌కు ఎక్కువశ్రద్ధ యుండెడిది కాదు. కాలమంతయు మార్క్సు పుస్తకములను చదువుచు రాజకీయములందు పాల్గొనుటకు వినియోగించెడివాడు.

లెనిన్‌కు చదరంగమనిన బహుప్రీతి. ఈతని అన్నయును, లెనిన్‌ను, వారితండ్రితో చదరంగమాడి ఓడిపోవుచుండెడివారు.

ప్లీడరీవృత్తియందు కొంతకాలము తరిఫీదు పొందిన తరువాత రష్యాదేశమంతయు సంచారముచేసి, ప్రజలయొక్క ఆర్థిక, సాంఘిక పరిస్థితులను తెలిసికొనుచు ప్రజలలో "కారల్ మార్క్సు" సిద్ధాంతములను ప్రచారము చేయసాగెను. ప్రభుత్వమువారు ప్రజలను పెట్టు బాధలు, కార్మికుల కష్టములు, రైతులుపడు యిబ్బందులు సంపూర్ణముగా

తెలుసుకొని "రైతులసమస్య" అను ఒక పుస్తకమును వ్రాసి ప్రచురించెను. ఆ కాలమున, కారల్ మార్క్సు సిద్ధాంతములను తప్పుగా తలంచుచు ప్రజలలో ప్రచారము జేయుచుండెడివారికి విరుద్ధముగా పత్రికలలో వ్యాసములు వ్రాయుచు, కరపత్రములను, పుస్తకములను ప్రకటించి మార్క్సు సిద్ధాంతములను వ్యాప్తిలోనికి దెచ్చెను.

౧౮౯౪ లో "సెంటుపీటర్సుబర్గులో" నివాస మేర్పరచుకొని తన రాజకీయ కార్యక్రమాన్ని చక్కగా నిర్ణయించుకొనెను. మరు సంవత్సరమున విదేశములకేగి, అందున్న "కారల్ మార్క్సు" శిష్యుల ననేకులను దర్శించి, తిరిగి వచ్చి ఒక రహస్యసంఘమును స్థాపించెను. కూలీలు, రైతులు తమ జన్మహక్కుల నెఱిగి వానికై ధనస్వాములతో పోరాడి వారిబారినుండి తప్పించుకొనుటకు వారందరిలో ప్రచారము చేసి, వారి శక్తులను కేంద్రీకరింపజేయుటయే ఈ సంఘముఖ్యోద్దేశ్యము.

ఆ కాలమున రష్యాచక్రవర్తి జారుయొక్క నిరంకుశ పరిపాలన చక్కగా సాగుచుండెను. తినుటకు తిండిలేక మలమల మాడుచున్న బీదప్రజలపయి, అక్రమపు పన్నులవిధించి, చక్రవర్తి తన బొక్కసమును నింపుకొనుచుండెను. ప్రజలయందు ప్రబలుచున్న ఆందోళనను, విప్లవబీజములను, నిరాకరణతను, అసంతృప్తతను తన సైనిక బలముచేత అణగద్రొక్కుచుండెను. భూస్వాములు, ధనవంతులు పాటక జనమును పీడించి, అనేక విధములుగా ధనార్జనము చేయుచుండిరి. ధన స్వాములు అనేక కర్మాగారములను నిర్మించి బీదప్రజల సహాయమున చాలడబ్బు సంపాదించుచుండిరి. కాని పాపము! రోజంతయు కష్టపడి పనిచేసి తన యజమానునకు విశేషలాభము చేకూర్చిపెట్టిన ఈ బీదలకు, ఈ కష్టజీవులకు రోజుకుకూలి మూడణాలుమాత్రమే. ఈమూడు

అణాలతో ఈ ప్రపంచ కష్టజీవియైన కార్మికుడు తన బిడ్డలకు ఆహారము పెట్టి, తాను తనభార్య పస్తుండ వలసినదే. పెట్టుబడిదారులు తమ పెట్టుబడిమీద రోజునకు పదింతలు లాభమువచ్చినను, చాలవని చెప్పకొనుచు, సమానసంసారముగల ఈ కష్టజీవి రోజునకు ఒక్క మూడుఅణాలు డబ్బులతో ఎట్లు జీవించుచున్నాడోయను గమనమే లేకుండ యుండిరి. కార్మికు లష్టకష్టములను బడుచుండ ధనాఢ్యుల భోగముల కంతులేకుండెను. చక్రవర్తిని ఆశ్రయించిన వారికి భూముల నిచ్చుటచేత పేదజనులు భూస్వాములు పెట్టుబాధలకు మరింత గురియగుచుండిరి. ఈవిధముగా దేశములో ప్రబలుచున్న అసంతృప్తిని లెనిన్ మహాశయుడు గ్రహించి, తన సంఘముద్వారా కార్మికకర్షకులలో ప్రచారము చేయసాగెను. దేశమందంతటను వెంటనే ఈ సంఘము ప్రసిద్ధిచెందెను. శాఖోపశాఖలు బయలుదేరెను. లెనిన్ ఈ కార్మిక కర్షకులకు తన శక్తికొలది సహాయము చేయుటచే ఇతనికి కార్మికులలో గొప్ప పలుకుబడి కలిగెను. కార్మికులు అప్పటినుంచియు లెనిన్ మాటకు జవదాటక, లెనిన్‌ను నాయకునిగా పెట్టుకొనిరి. కార్మికులు తమహక్కులను కాపాడుకొనుటకు లెనిన్ నాయకత్వముక్రింద సమ్మెచేయుటకు నిశ్చయించి, సమ్మెను తీవ్రముగా సాగించిరి. సమ్మె ముగిసినపిమ్మట లెనిన్ స్విట్జర్లండు వెళ్ళి ౧౮౯౫-వ సంవత్సరమున తిరిగివచ్చెను.

ఆ సంవత్సరమే ప్రభుత్వమువారితనిని, యితని మిత్రులను అరెస్టుచేసిరి. ౧౮౯౬-వ సంవత్సరమంతయు జైలునందే గడిపెను. జైలునుంచి విడుదలయైన వెంటనే ౧౮౯౭ లో ఆయనకు మూడుసంవత్సరములు దేశాంతరవాసశిక్ష (సైబీరియా ప్రవాసము) విధించిరి. సైబీరియా ప్రవాసమనగా, మన హిందూదేశపు అండమాను శిక్షవంటిదే. సైబీరియా అండమానులు రెండును భూలోక నరకములని చెప్పవచ్చును. ఈ ప్రవాసకాలమునందు లెనిన్ విశ్రాంతి గైకొని పూర్ణారోగ్యము వడయగలి

గెను. ఇచ్చటనే మార్క్సువాదమహాశయుని దర్శనము లభించినది. వారిని సంప్రదించి తన భావిరాజకీయ కార్యక్రమమును, మరింత చక్కగా నేర్పరచుకొనెను.

౧౮౯౮ వ సంవత్సరమున లెనిన్ "యన్. కె. క్రుపాస్కాయా" అను స్త్రీని వివాహమాడెను. ఈ సంవత్సరములోనే ఈ మహాశయుడు ప్రపంచవిఖ్యాతి గాంచిన "డెవలప్‌మెంట్సు ఆఫ్ కేపిటలిజమ్ ఇన్ రష్యా" (Developements of Capitalism in Russia) అను ఆంగ్ల గ్రంథము నొకదానిని వ్రాసెను. ౧౯౦౦ లో ఒక విప్లవ సంబంధమైన పత్రిక నొకదానిని వెలువరించవలయునని స్విడ్జర్లండుకు పోయి అచ్చట నుండి "ఇస్క్రా" (అగ్ని కణములు) అనే పత్రికను నడుపుచుండెను. ఈ పత్రిక ముఖ్యోద్దేశము చాలవరకు కార్మికులస్థితిని బాగుచేయుటయు, మార్క్సు సిద్ధాంతములను కార్మికులయందు విరివిగా ప్రచారము చేయుటయునై యుండెను. కాని ప్రభుత్వమువారు దానిని తోడనే అణచివేసిరి.

౧౮౯౮-వ సంవత్సరములో రష్యన్ సోషల్ డెమాక్రెటిక్ లేబరు పార్టీ ప్రథమ కాంగ్రెసు సమావేశమాయెను. కాని అప్పటికి లెనిన్ సైబీరియా ప్రవాసశిక్ష ననుభవించుచుండుటచే ఈ సభకు హాజరు కాలేకపోయెను. మరల ౧౯౦౩ లో పై కాంగ్రెసు సమావేశము లండనులో జరిగినప్పుడు లెనిన్ హాజరయ్యెను. అంతఃకలహములు కలిగి రెండు పార్టీలు ఏర్పడినవి. బోల్షివిక్ పార్టీకి లెనిన్ నాయకుడు.

ధనస్వాముల నెన్నడు నమ్మరాదనియు, వారివలన ఎప్పుడును సాహాయ్య మపేక్షింపకూడదనియు కార్మికకర్షకులతోనే పనిచేయవలయుననియు వీరి యుద్దేశము. రెండవపార్టీయైన మెన్షివిక్ పార్టీవారు ధనస్వాములైన మితవాదులతో కలసి పనిచేయవలయునని యుద్దేశ్యము కలవారు.

లెనిన్ మహాశయుడు నిద్రాహారములుకూడ మాని, కార్మికులలో తీవ్రప్రచారము చేయసాగెను. కొన్ని కరపత్రములనుకూడ ప్రచురించెను. వీటి ఫలితముగ ప్రజలలో విప్లవబీజములు, సామ్యవాద సిద్ధాంతములు నాటుకొనిపోయి, నానాటికి వృద్ధిబొందజొచ్చెను. నిరంకుశత్వమును రూపుమాపవలయునని ప్రజలలో గాఢమగు నభిలాష పుట్టెను. ప్రభుత్వబలము, పరువుప్రతిష్టలు అంతకంతకు సన్నగిల్లెను. ౧౯౦౧ నుండియు కార్మికోద్యమము మరింత తీవ్రముగా విజృంభించెను. ౧౯౦౫ అక్టోబరులో కార్మికులందరు లెనిన్ నాయకత్వమున గొప్ప సమ్మెను సాగించిరి. సమ్మెదారులందరు పురవీథులలో నూరేగుచుండగా ప్రభుత్వము వారు కార్మికులను కాల్పింపదొడగిరి. దీనితో ప్రజలకు జారు ప్రభుత్వమన్న మరింత ఏవగింపుగలిగి దేశమంతయు వారి అసమ్మతి వెలుపుచు హర్తాలులు జరిపిరి. ఆ పరిస్థితులలో ప్రభుత్వము దేశమునందలి యుద్రేకముచూచి గడగడలాడినది. ౧౯౦౪ లో జరిగిన రష్యా జపానుయుద్ధములో రష్యా ఓడిపోవుటకు ఇది ముఖ్యకారణము.

౧౯౦౫ సం॥లో రష్యాకును, లెనిన్‌నకుకూడ గొప్ప అనుకూల సమయము. ఈ రోజులలోనే జారుప్రభుత్వమునకు కొన్ని విపరీత పరిస్థితులుకలిగి, కొన్ని రాజకీయాధికారములు ప్రజలచేతులలోనికి వచ్చినవి. కాని ఆ అధికారములు అట్టేకాలము నిలువలేదు. ఈ సమయముననే బోల్షివిక్‌పార్టీలో కార్మికుల ననేకుల జేర్పించుటకు లెనిను ఒక ప్రకటన గావించెను. దాని ఫలితముగ కార్మికకర్షక సైన్యసమూహములందు సంఘస్థాపనలు ఎక్కువగా జరిగి చక్కని ఏకీభావమేర్పడి ఒక బోల్షివిక్ సంఘము నొకదానిని స్థాపించిరి. డిశంబరు ఆఖరున రష్యాలో ప్రసిద్ధపట్టణములలో విప్లవము చెలరేగినది. ఈ విప్లవము మొదట జయప్రదముగా కాన్పించినను పల్లెలలోను పట్టణములలోను సరియగు నాయకులు లేకపోవుటచే, ప్రభుత్వమువారు దీనిని వెంటనే అణచగలిగిరి.

ఈ విప్లవము ముగిసినపిమ్మట లెనిన్ చాలకాలము మారువేష ముతో సంచరించెను. పోలీసులు లెనిన్‌ను వెన్నంటుచునే యుండిరి. ౧౯౦౭ నుండి లెనిన్ తప్పనిసరిగా దేశమును విడువవలసివచ్చెను. ఈ పర్యాయము తిరిగి పదిసంవత్సరములవరకు స్వదేశమునకు రాలేకపో యెను. లెనిన్‌మహాశయుడు విదేశములందుండినను తన యుద్యమమును విడువక కరపత్రములను, పుస్తకములను రష్యాకు పంపుచుండెడివాడు. ౧౯౧౦ లో లెనిన్ మూడు సామ్యవాద పత్రికలను నడుపుచు కార్మిక కర్షకులను ఆవేశపూరితులుగా చేయుచుండెడివాడు. ధనస్వాములకు ఈ పత్రికలలోని వ్యాసములు కర్ణకఠోరముగను, భరించరానివిగను నుండెను. ౧౯౧౨ జనవరిలో "ప్రేగ్" అను పట్టణమున జరిగిన యొక సామ్యవాదసభకు, ఇతను క్రాకో అను రహస్యప్రదేశమునుండి సహాయముచేసి, సూత్రధారుడుగ నుండెను. రష్యాదేశపు రాజకీయకార్య క్రమమునంతయు నితనే నడుపుచుండెను. అప్పటికి లెనిన్ పేరు రష్యా దేశమంతయు మారుమ్రోగుచుండెను. ఒకనాడు రష్యా క్షామనివారణ సభలో ధనముకొరకు ఒకరు ఉపన్యసించుచుండగా మధ్యలో లెనిన్ లేచి యిటుల పలికెను. "క్షామనివారణకు ధనమివ్వకుడు. ధనమిచ్చి నచో కార్మిక, కర్షకులలోని శక్తులు ప్రజ్వలింపజాలవు. కనుక కార్మిక కర్ష లలో ఆవేశముకల్గి వారి శక్తులను ప్రజ్వలించునట్లుగా జేయునది ఒక్క క్షామమే"

౧౯౧౪ సంవత్సరములో ప్రపంచమహాసంగ్రామము జరిగినపుడు లెనిన్ ఆస్ట్రియాదేశములో నుండెను. అచటనుండి రష్యాప్రజలకు ఒక సందేశమునంపెను. ఈ యుద్ధమువలన పాటకజనమునకు, కార్మికు లకు ఏవిధమైన లాభములేదనియు—ధనవంతులు, భూస్వాముల స్వార్థ ముకొరకేర్పడినదనియు—కావున దీనిలో కార్మికులెవరును జోక్యము

కలుగజేసికొనరాదనియు నందులో వ్రాసెను. దీనితో ప్రభుత్వబలము క్షీణింపసాగెను. ప్రభుత్వపక్షమున ఒకసైన్యముతప్ప ఇతరు లెవ్వరును సంబంధము కలుగజేసుకొనరైరి. ఆస్ట్రియా ప్రభుత్వమువారు లెనిన్‌ను దేశమునుండి వెడలవలయునని ఆజ్ఞాపించినను మారువేషముతో రెండు సంవత్సరములు అచ్చటనే కాలముగడిపెను. ౧౯౧౭ లో జారుచక్రవర్తి సింహాసనభ్రష్టుడైనాడని తెలియగనే లెనిన్ స్వదేశము చేరుకొనెను. ౧౯౧౭ అక్టోబరులో గొప్పవిప్లవము బయలుదేరి జారుప్రభుత్వమును తొలగించివేసెను. ఆ విప్లవములో చాలమంది ప్రభుత్వవర్గమువారు విప్లవకారులకు గురియైరి. ఎక్కడ చూచిన రక్తపాతమే కాన్పించెను. అంతమాత్రమున ప్రభుత్వపరిపాలన విప్లవకారుల హస్తగతము కాలేదు. అప్పటిలో మిగిలియున్న ప్రభుత్వనాయకుడను "కెరన్‌స్కీ" యనువాడు రాజ్యపరిపాలన చేయసాగెను. కాని అతనికి విప్లవవీరులు ఎక్కువఆటంకముల కల్పించి, హత్యలు యింకను చేయుచుండుటచే, అయిదు నెలలకంటె ఎక్కువకాలము రాజ్యముచేయలేకపోయెను. ఆఖరుకు కెరన్‌స్కీ మారువేషమున ప్రాణములను దక్కించుకొని ఎచ్చటకో పారిపోయెను.

ఇప్పుడు ఒక్కసారిగా రాజ్యము సామ్యవాదుల వశమయ్యెను. సామ్యవాదు లన నెవ్వరు? కార్మిక కర్షకులే. చిన్నప్పటినుండియు స్వలాభము అనునది తెలియక, స్వార్థమును త్యజించి, దేశమునకు తమ ప్రాణముల సహితము అర్పించుటకు సంసిద్ధులై భూలోకనరకమను సైబీరియా ప్రవాస మనుభవించి, సమస్త కష్టముల కోర్చి, తుట్టతుదకు విప్లవరూపమున సంపూర్ణ స్వాతంత్ర్యమును సాధించగలిగిన సమరవీరులే సామ్యవాదులు. వీరే కార్మికకర్షక బాంధవులు. వీరికే నాయకుడు మన లెనిన్. ఈ సామ్యవాదప్రభుత్వమునకు లెనిన్‌ను దేశమంతయు అధ్యక్షుడుగా ఎన్నుకొనెను. లెనిన్ ఆరంభవీరత్వముకొలది ధనస్వాములు

ఈరీతియ నాజ్ఞాపించినను చాల మందిని దయతో విడిచిపెట్టెను. ఇంగుచే శత్రువులగు అనేకులు ధనస్వాములుగూడ ఈతనికి సహాయ మొనర్చిరి. లెనిన్ మహాశయుడు ధనస్వాములను క్షమించుటవలన బోల్షివిక్‌లు తరువాత ఎన్నియో కష్టముల నెదుర్కొనవలసి వచ్చెను. ఈ విషయమున లెనిన్ కుడిభుజమగు ట్రాట్స్కీ కూడ ఒకచోట నిట్లు వ్రాసెను. "విప్లవసమయమందు చాలమంది శత్రువులను క్షమించుచుండుటయే మేము చేసిన గొప్ప పొరపాటు."

౧౯౧౭ నుంచి రష్యాలో పూర్ణమైన సోవియట్ రాజ్యము స్థాపితమయ్యెను. లెనిన్ రాత్రింబవళ్లు కార్మికకర్షకులను గురించి ఆలోచించెడువాడు. ౧౯౨౨ సంవత్సరములో రష్యాలో జరిగిన కాంగ్రెసునకు వెళ్లి లెనిన్ గొప్ప ఉపన్యాసమిచ్చుచు, ధనస్వాముల నిరంకుశ పరిపాలనమును గురించియు, కార్మిక, కర్షకుల కష్టములను గురించియు చెప్పెను. నేడు స్వచ్ఛమైన కూలీరాజ్యము నడుచుచున్నదనికూడ చెప్పెను.

లెనిన్ మహాశయుడు ఏకగ్రీవముగా అయిదేండ్లు పరిపాలించ గలిగెను. ఈత డొక మహాత్ముడనియే చెప్పవచ్చును. మహాత్మ లెనిన్ రష్యాలోని రైతులను, కూలీలను జారుప్రభుత్వముయొక్క నిరంకుశ పరిపాలనము నుండి రక్షించుటకై యవతరించిన మహాపురుషుడు.

తన జీవితకాలమందే తన యుద్యమ ఫలితమును చూడగలిగిన ధన్యుడు. రష్యాకంతకును నియంతయై, కూలీరాజ్యమును స్థాపించి నడుపుచున్నను లెనిన్‌నకు దేశములో శత్రువులు లేకపోలేదు. లెనిన్‌ను హత్యగావింపవలెనని అనేకులు హంతకులు వేచియుండిరి. ౧౯౧౮ జనవరి ౧౪ వ తేదీన లెనిన్ సోర్జల్లసభలో నుపన్యసించుచుండగా, లెనిన్‌ను చంపుటకై వచ్చిన ఇద్దరు హంతకులు పట్టువడిరి. ఆ ఇరువురి

కుట్రదారుల విచారణ ముగియగనే లెనిన్ వారికి కమ్యూనిజమును గూర్చిన పుస్తకములను బహూకరించి విడిపింప నాజ్ఞాపించెను. పిమ్మట ౧౯౧౮ ఆగష్టు 30 వ తేదీని లెనిన్ "మిఖేలెసన్" కర్మాగారమునకు బోయి ఆ కార్మికుల సభలో నుపన్యసించి, మోటారు ఎక్కబోవు చుండ, "ఫానీకప్లాన్" అను ఒక స్త్రీ అతనిని గురిపెట్టి రివాల్వరు ప్రేల్చెను. అప్పటినుండియు లెనిన్‌కు అస్వస్థత ప్రారంభమాయెను. ౧౯౨౨ నాటికి లెనిను ఆరోగ్యము పూర్తిగా చెడిపోయి చివరరోజులలో పక్షవాతముచే మంచముపట్టి ౧౯౨౪ జనవరి ౨ వ తేదీన సాయంత్రము ౪ గంటలకు ప్రపంచమునుండి విశ్రాంతిగైకొని వీరస్వర్గము నలంకరించెను.

కూలివాని క్షేమమే తన క్షేమమని యెంచి, జారుప్రభుత్వముతో హోరాహోరీని పోరాడి, చివరకు కూలీరాజ్యమును స్థాపించిన లెనిను మహాశయుడు ప్రపంచమునకు గొప్ప ఆదర్శపురుషుడని చెప్పకతప్పదు. ఇట్టి ఆదర్శపురుషుని కళేబరమును శాస్త్రజ్ఞులు మాస్కో నగరములో రెడ్ స్క్వేరులో పదిలపరచిరి. ఈ మృతకళేబరమును చూచుటకు నేటికిని అనేకమంది వచ్చిపోవుచుందురు. గాజుపెట్టెలో అమర్చిన శవమును చూచి, "లెనిన్" యింకను బ్రతికియుండెననియే తలచి, "లెనిన్ చావలేదు. చావలేదు" అని అరచి వెళ్లుదురట! కొందరు భక్తులు. చనిపోయి ౧౪ సం॥ములైనను లెనిన్‌యొక్క శరీరమును నేటికిని చూడగలుగుచున్నామనిన లెనిన్ నాయకత్వమున తరిఫీదు పొందిన ఆ రష్యాసోదరుల భక్తిశ్రద్ధలే కదా కారణములు!

# స్టాలిన్



"స్టాలినును వంటచేయనుంటే, అతి ఘాటుపాకంగా తయారు చేస్తాడు." లెనిన్.

ధనవంతులకు ధూమకేతువువలె నున్న సామ్యవాద పతాకము నెగురవైచి, ప్రపంచమును కలవరపరచుచున్న ఆధునిక రష్యాదేశము నకు నియంత స్టాలిన్. ప్రపంచములోని మహాశక్తివంతులలో అగ్రగణ్యుడు. ఇతనితో పోల్చదగిన మనిషి ఎవడును సాధారణముగా కనిపించడు. ప్రపంచములోని ఇతర నియంతలకును, స్టాలిన్‌కును చాలా తేడాలున్నవి. తనదేశమున కెదురులేని నాయకుడే గాక, ప్రపంచమంతటను ప్రేళ్లు పాతుకుపోయిన యొకానొక మహోద్యమానికి నాయకుడు కూడా. ఆ మహోద్యమము పేరు "కమ్యూనిజం".

౧౮౭౯ సంవత్సరములో జార్జియా రాష్ట్రములో ట్రిప్లిన్ పట్టణ సమీపమున "గోరా" గ్రామములో స్టాలిన్ జన్మించెను. అసలు పేరు జోసఫ్. తల్లి "జోజో గాషి" యని పేరు పెట్టినది. కొంతకాలమునకు లెనిన్ ఈతనికి స్టాలిన్ అని పేరుపెట్టెను. 'స్టాలిన్' అనగా ఉక్కుమనిషి యని యర్థము. 'స్టాలిన్ యొక్క శరీరము ఉక్కువలె గట్టిగా నుండును.' అని భావము.

తండ్రి జార్జియాలో చెప్పులుకుట్టి నిత్యజీవనమును గడుపుచుండెడి వాడు. తండ్రితో పనిచేయుచున్నను మనస్సు ఎప్పుడును పరాలోచన లోనే యుండెడిది. స్టాలిన్ తండ్రి హిట్లరుతండ్రివలెనే దూరదృష్టి లేనివాడు, తండ్రికి స్టాలిన్‌ను చదివించుదమనే ఉద్దేశ్యము యేమాత్రము లేదు. తన కులవృత్తియగు చెప్పులు కుట్టుపనినే ఈతడుకూడ అవలంబింపవలెనని అతనికోరిక. కాని స్టాలినుతల్లికి మాత్రము, తనకొడుకు

మతగురువు కావలెననే కోరిక యుండెడిది. ప్రాథమిక విద్యాభ్యాసము ముగియగనే ట్రిప్లిన్‌లో మతగురువులను తయారుచేయు సనాతనవిద్యాలయమున స్టాలిన్ ప్రవేశించెను. స్టాలిన్‌కు ఈ విద్యాలయమునందే సామ్యవాద జన్మదాతయగు కారల్ మార్క్స్ సిద్ధాంతములు పట్టువడెను. అందువలన స్టాలిన్ ఆ సిద్ధాంతములను గ్రహించి రహస్యగృహములలో ప్రచారము చేయుటయందు ఆరితేరి సమయమునకై వేచియుండెను. విద్యాలయాధికారులు ఇది గ్రహించి మతాచార్యుడగుటకు తగడని ఈతనిని విద్యాలయమునుండి వెడలగొట్టిరి. నాటితో స్టాలిన్ హృదయములో విప్లవబీజములు పూర్తిగా నాటుకొని పోయెను.

అతని కటిక పేదరికము, మతగురువుల విద్యాలయములో కలిగిన అనుభవములే స్టాలిన్ విప్లవములో చేరుటకు కారణములు. స్టాలిన్ విద్యాలయమునుండి బయటపడిన తరువాత విప్లవప్రచారము, సమ్మెలు, నిషేధగ్రంథ ముద్రణము, రహస్యవిప్లవ సంఘనిర్మాణము మొదలగు సమస్యలనుగురించి ఆలోచించి ఎక్కువగా వానికొరకు తనకాలమును వినియోగపరచెను. ౧౯౦౧ వరకు తనపేరు పైకి తెలియకుండగనే, రహస్యముగా, సి. ఐ. డి. లచే చిక్కకుండ జాగ్రత్తగా పనిచేయగల్గెను. కాని ౧౯౦౧ లో వారు గుర్తించి రాజద్రోహుల జాబితాలో చేర్చిరి. ౧౯౦౨ లో స్టాలిన్‌ను అరెస్టుచేసిరి. తూర్పు సైబీరియాకు ప్రవాసము పంపిరి. నెల రోజులుకూడ గడవకపూర్వమే స్టాలిను తన మిత్రుల సహాయముచే సైబీరియానుండి తప్పించుకొని "ఇవానోవిచ్" అను పేరుతో యూరప్ దేశములోని విప్లవ మహాసభకు హాజరై ౧౯౦౭ వ నాటికి లండను చేరెను.

౧౯౦౭ లో ట్రిప్లినులో స్టాలిన్ అనుచరులు జరిపిన దోపిడిలో కూడ కొంతవరకు బాధ్యుడై యుండుటవలన కొంతకాలము పార్టీ

నుంచి బహిష్కరించిరి. ౧౯౦౭ నుండియు స్టాలిన్ మరల రష్యా ప్రవేశించి తన యుద్యమమును తీవ్రముగా సాగించెను. ఈమారు తన నిషేధ గ్రంథ ముద్రణము, ప్రచురణము మొదలైనవానిని ఏగుఱ్ఱపుశాలలలోనో, ఏగుహాలలోనో, ఏమారు మూలగుడిసెలలోనో చేయుచుండెడివాడు. తనకు మహోపద్రవము రానున్నదని తెలిసికొనియు భూలోకనరకమగు సైబీరియాకు పోవలయునో లేక కారాగారమున నుండవలయునో తెలిసికొనికూడ ప్రభుత్వముతో బహిరంగ ప్రతిఘటన ప్రారంభించెను. ౧౯౧౨ లో స్టాలిన్‌ను ప్రభుత్వమువారు దేశమునుండి వెడలగొట్టిరి.

ఈ జైలు ప్రవాసశిక్షలమధ్య స్టాలిన్ అప్పుడప్పుడు పుస్తకములను వ్రాయుచుండెడివాడు. "కాస్పియన్" సముద్రతీరమున "బంతు" పట్టణములో నున్నప్పుడు "వ్రెమియా" (Vremia) అను బోల్షివిక్ పత్రికను నడిపెడివాడు. ౧౯౧౨-వ సంవత్సరము నాటికి స్టాలిన్ 'సోషలిజం-జాతీయ సమస్య' (Socialism and the National Question) అను నొక పుస్తకమును వ్రాసి ప్రకటించినాడు. డ్యూమా (Duma) లో సోషల్ డిమోక్రాటిక్ పార్టీకి యితడు నాయకుడు. డ్యూమా అనగా కార్మికుల కోరికలను చెల్లించెదనని జార్ చక్రవర్తి ఏర్పాటు చేసిన పార్లమెంటు. ఈ పార్లమెంటు సభ్యులందరు రాజవర్గమునకు చెందిన వారగుటచేత కార్మికులకు ఏవిధమైన సహాయము చేయుటలేదు. అందువలన స్టాలిన్ సోషల్ డిమోక్రెటిక్ పార్టీకి నాయకత్వము వహింపవలసి వచ్చెను. ప్రవడా (Pravada) అను బోల్షివిక్ పత్రికకుకూడా ఈతడు సంపాదకుడు. ౧౯౧౩ లో స్టాలిన్ ఒక గూఢచారి మోసమువలన తిరిగి జార్ ప్రభుత్వమువారి చేతులలో బడెను. ఈసారి స్టాలెమనకు పారిపోవుటకు ఏమాత్రము అవకాశము చిక్కనీయలేదు.

౧౯౦౧-౧౯౧౭ వరకుగల ౧౬ సంవత్సరముల అజ్ఞాతకాలములో స్టాలిన్ ఒక నిముషముకూడ వ్యర్థపరచలేదు. విప్లవముకోసము

కృషిసల్పి ఒకగొప్ప విప్లవసంస్థనుకూడ స్థాపించుటకు ఓపికతోను, పట్టుదలతోను పనిచేసెను. ఈ విప్లవము కోసమే స్టాలిన్ అనేకబాధలకులోనై అనేక పర్యాయములు కారాగారములను వరించి ఉరికంబమునుకూడ నెక్కుటకు వెనుదీయక ప్రతిపక్షులను హతమార్చి చివరకు విప్లవము తెచ్చుటలో కృతకృత్యు డయ్యెను. ౧౯౦౫ వ సంవత్సరములో విప్లవోద్యమము విఫలమైనపుడు తక్కిన నాయకులందరు రష్యాను విడిచిపెట్టి ఇతర దేశములకు పరారైరి. కాని స్టాలిన్ మాత్రము ఎప్పుడును రష్యాలోనేయుండి మారువేషములతో సంచరించెను.

౧౯౧౭ వ సంవత్సరమున బయలుదేరిన విప్లవముతో స్టాలిన్‌కు సుదినములు ప్రాప్తించినవి. విప్లవ జయముతో కారాగార విముక్తి నందెను. స్టాలిన్ కారాగార విముక్తుడై వెంటనే తనపార్టీకి కలిగిన అఖండ విజయమును చూచుటకు మాస్కో చేరెను. కొంతకాలము ట్రాట్‌స్కీతోను, లెనిన్‌తోను కలిసి జారుప్రభుత్వ విధ్వంసమునకు పూనుకొనెను.

౧౯౧౭ లోని విప్లవము విజయము గాంచిన వెంటనే ప్రభుత్వము బోల్షివిక్కుల వశమయ్యెను. ౧౯౧౭ సంవత్సరం అక్టోబరు ౧౦ వ తేదీన తనపార్టీ సిద్ధాంతములను ప్రచారము చేయుటకుగాను పొలిట్-బరో (Polit-buro) అను పత్రికను స్థాపించెను. అప్పటినుండియు స్టాలిన్ ఈ పత్రికను నడిపించు కమిటీలో సభ్యుడుగా నుండెను. మొదట స్టాలిన్‌కు సోవియట్ గవర్నమెంటులో ఏ ఉద్యోగమును లేదు. కాని సోవియట్ గవర్నమెంటుకు ప్రాణతుల్యమైన ఎగ్జిక్యూటివ్ కమిటీలోని ౩౭ గురు సభ్యులలోను స్టాలిన్‌కూడ ఒక సభ్యుడు. కొంతకాలమునకు స్టాలిన్ యొక్క కార్యపటుత్వమునకు మెచ్చుకొని

లెనిన్ ఈతనికి పార్టీ సెక్రటరీ పదవినిచ్చెను. అప్పటినుండియు స్టాలిను వలన పార్టీ సెక్రటరీ పదవికి ప్రాముఖ్యము వచ్చినది. కాని పార్టీ సెక్రటరీ పదవివలన స్టాలిన్‌కు ప్రాముఖ్యము రాలేదు. సోవియట్ మంత్రి వర్గమును ఏర్పరచునప్పుడు ఇతనికి రెండు డిపార్టుమెంటును ఒప్పగించిరి. కార్మికకర్షకులను అజమాయిషీచేయు డిపార్టుమెంటును, జాతీయనిర్మాణము చేయు డిపార్టుమెంటును ఈతనికి ఇచ్చిరి. ట్రాట్స్కీ అనిన స్టాలిన్‌కు మొదటనుండియు అసూయయే. వీరిద్దరికి ఎప్పుడును బద్ధవైరమే. స్టాలిన్ ట్రాట్స్కీపై అనేక పర్యాయములు కుట్రప్రయత్నములు జరుపుచుండగా లెనిన్ గ్రహించి ట్రాట్స్కీని మెల్కొల్పి స్టాలిన్‌ను మందలించెడివాడు.

రష్యా డిక్టేటరులలో స్టాలిన్ రెండవవాడు. లెనిన్ మొదటివాడు. పార్టీయంత్రము తనచేతులలో నుంచుకొనుటవలన అనేక లాభము లున్నవి యని గ్రహించినవాడు స్టాలిన్ ఒక్కడే. లెనిన్ తన తర్వాత నాయకత్వమున స్టాలిన్‌నే తగునని అనుకొనెను. కాని చివర రోజులలో లెనిన్‌కు స్టాలిన్‌కు కలిగిన అంతఃకలహములవలన లెనిన్‌కు అనుమానముగల్గి ఒక డాక్యుమెంటును వ్రాసియిచ్చెను. కాని ఆ డాక్యుమెంటును స్టాలిన్ పైకి రానీయకుండా అణగద్రొక్కి వేసెను. లెనిన్ స్టాలిన్‌ను నమ్ముచుండెను. కాని స్టాలిన్ మాత్రము ఎవరినికూడా నమ్మువాడుకాడు. ఫాదిరీకి ఏసుక్రీస్తు అనిన ఎంతటి భక్తియో, ఈతనికి 'కమ్యూనిజము' అనిన అంతటి మూఢభక్తి. నిర్దాక్షిణ్యము చూపుటయందు స్టాలిన్ అంతటి క్రూరాత్ముడు లేడని ప్రతీతి. ప్రతికక్షులను నిర్దాక్షిణ్యముగా నాశనము చేయుటయే రష్యా కమ్యూనిస్టుల సిద్ధాంతము. విప్లవ దౌర్జన్యకార్యములలో స్టాలిన్ తోడ్పడు చుండువాడు. పార్టీకి డబ్బుకావలసి వచ్చినపుడు బ్యాంకులను కొల్లగొట్టువారు. 'నిరు

పేదలను కొల్లగొట్టి దోచుకున్న ధనరాసులు కదా యీభాగ్యవంతులు' అని వీరి సిద్ధాంతము.

శీతకాలమున స్టాలిన్ క్రెమ్లినులో నివసించును వేసవికాలములో మాత్రము మనోహరమైన గోర్కీ భవనమున నివసించును. స్టాలిన్ ప్రతి దినమును తనపని ముగిసినవెంటనే, తన భవనమునుగిడి ఒకే రంగుకలిగి యినుప ఊచలచే గట్టిగా భద్రపరుపబడి నూరడు మోటారులు, ఒకే సమయమున గోర్కీ భవనమునకు షికారుగా బయలుదేరును. ఈ నూరడు కారులలో స్టాలిన్ ఎందులోనున్నది ఎవరికిని తెలియదు. గోర్కీ భవనముకూడా ఇతనుల నెవ్వరిని రానీయకుండ కొంతమంది రక్షక భటులచే కాపలా కాయబడుచుండును. ప్రపంచమున ఘనతకెక్కిన రష్యాదేశమునకు నియంతయగు స్టాలిన్ నేడు యింత భద్రముగను, భయముగను, తన ప్రాణమును కాపాడుకొను టెందులకు?

౧౯౧౭ విప్లవములో జారుచక్రవర్తుల రక్తమును చవిజూచి, రక్షకభటుల ప్రాణముల నాహుతిగగొన్న తుపాకిగుండ్లు బోల్షివిక్ రక్తమును త్రావి పగతీర్చుకొనుటకు వేచియున్నవని స్టాలినుకు తెలియును.

చిన్నతనము నుండియు తన కష్టసుఖములలో సహధర్మచారిణియై తన తోడునీడయైనటువంటి భార్య మరణము స్టాలినుకు పిడుగువంటి దాయెను.

స్టాలిన్ రష్యానంతను తన సిద్ధాంతములపై నడిపించుటకు అయిదేండ్లు పట్టినది. పార్టీయంత్రమును పూర్తిగా తనచేతులలో పెట్టుకొని తనకు అడ్డు తగిలిన ప్రతికక్షులను నిర్దాక్షిణ్యముగా యమపురి కంపుచుండెను. నియంతలు నిర్దాక్షిణ్యముగా నుండనిచో వారికి చాల ముప్పువాటిల్లునను వారిలో నతడు ప్రముఖుడు. అనేక జాతులు,

ఘాషలు కలిగిన రష్యాదేశమును తన ఏకచ్ఛత్రాధిపత్యమున పాలించుటకు స్టాలిన్ యింతటి నిర్దాక్షిణ్యము వహింపవలసి వచ్చినది. ఇంతకును రష్యాకును, స్టాలినుకు, జగత్ప్రసిద్ధమైన ప్రాముఖ్యమునకు కారణము మార్క్సు లెనినులు చెప్పినమాత్రములే. వానినే స్టాలిన్ అమలులో పెట్టి ప్రపంచమునకు ఆదర్శపురుషు డాయెను.

---

## డీ వేల రా

"డీవేలరాతో రాజీబేరాలు మాట్లాడడం భూమ్యాకాశముల మధ్యనున్న గుర్రంమీదకు ఎక్కడానికి ప్రయత్నించడమో, లేకపోతే, గుర్రం ముందు నిలిచి గుర్రంమీది వారిని పట్టుకోవడమో."

— లాయడ్ జార్జి.

ఐర్లాండు నాయకుడగు డీవేలరా జీవితమును చదివిన ప్రతియువకునకును, యువకునికేకాదు—మనుష్య మాత్రుడైన ప్రతివ్యక్తికిని—కొంత ఆవేశము, దేశాభిమానము, స్వతంత్రశక్తి ఉద్భవించక మానవు.

ఒక సామాన్యమానవుడు—ఉరికంబముకూడ నెక్కి తప్పించుకొన్న ఒక స్వాతంత్ర్యవీరుడు— నేటిరోజున ఒకరాజ్యమును నిరాఘాటముగా పాలించుచుండుట ప్రతిమానవునికి ఆశ్చర్యము కలిగింపక మానదు. ఆ సామాన్య స్వతంత్రవీరుడే మన కథానాయకుడు డీవేలరా.

డీవేలరా ౧౮౮౨ సంవత్సరం అక్టోబరు ౧౪ వ తేదీని న్యూయార్కు నగరమున జన్మించెను. ఈతని పూర్తిపేరు ఈమన్ డీవేలరా.

తల్లి పేరు. కాథరైన్ కాల్. ఆమెది ఐరిష్‌జాతి. తాత్కాలికముగా న్యూయార్కు నగరముననుండిన స్పెయిన్ దేశీయుడైన విలియన్ డీవేలరాను పెండ్లాడినది. ఈమెన్ డీవేలరా అమెరికాయందు జన్మించుటచే అమెరికాకును, ఐర్లండునకును ఒక విధమైన సంబంధ మేర్పడినది.

డీవేలరా న్యూయార్కులో పుట్టినప్పటికి ఐర్లండులో తన మేనమామగారియింట నుండవలసి వచ్చినది. డీవేలరా గొప్ప మేధావి. ఒక్క నిముషమైనను వృధాపుచ్చక తీరుబడిసమయములో ఏవిప్లవ వీరులనుగురించియో చదివెడివాడు. గణితశాస్త్రము, ఆటలు యన బహుప్రీతి. డీవేలరా బ్లాక్‌రాక్ కళాశాలలో విద్యార్థిగాచేరి, రాయల్ విశ్వవిద్యాలయములో పట్టభద్రుడై జీవనోపాధికై ఎడ్యుకేషనల్ డిపార్టుమెంటునకును, సివిల్ సర్వీసునకును దరఖాస్తు పెట్టి విఫలుడయ్యెను.

సివిల్ సర్వీసులోకూడ డీవేలరాకు స్థానముదొరకక పోవుటచే నిరాశజెందెను. చివరకు 'బ్రతుకు తెరువులేనిచో బడిపంతు' లన్నట్లుగా, ఒక పాఠశాలలో గణిత శాస్త్రోపాధ్యాయుడుగా ప్రవేశించెను. ఇక్కడే ఈతనికి వాదకతాశక్తి పట్టుబడినది. ఈశక్తియే డీవేలరాను రాజకీయ రణరంగములోనికి దుమికించి, అనేక మహాసభలకు ఆహ్వానింప జేసినది. ఇతని వాదనాశక్తి లాయడ్‌జార్జివంటి మేధాశాలినిగూడ చకితుని చేసినది. డబ్లిన్‌లో ఉపాధ్యాయుడుగానున్న ఆ రోజులలో డీవేలరాకు ఐర్లండుదేశపు దాస్యవిముక్తిచేసి స్వాతంత్ర్య దేశము చేయవలయునని కోరిక జనించి, యీతనిని అందోళన పరచుచుండెడిది. ౧౯౧౬ లో జరిగిన ఐరిషు విప్లవములో నాయకుడై ముందు కురికెను డీవెలరా. అరేబియా దేశస్థునికి గుఱ్ఱమన ఎంత ప్రీతియో, డీవెలరాకు తుపాకియన అంత సరదాయుండెడిది.

౧౯౧౪-వ సంవత్సరమున డీవేలరా మొదట సామాన్య

స్వచ్ఛంద సేవకుడుగా నుండెను. అందరివలె తానొక నాయకుడుగా నుండవలయుననియు, పేరుప్రతిష్టలు సంపాదించ వలయుననియు కోరిక లతని కెన్నడునులేవు. కాని నాయకత్వము వహించతగిన సమయ మాసన్నమైనప్పుడు, అవసరము కలిగినప్పుడు ప్రజల మన్ననలకు పాత్రుడైనాడు. విప్లవములో దెబ్బలుతిన్న వారిలోకూడ డీవేలరాదే ఫస్టుమార్కు. తనపక్షము వారందరిలోను చివరదాక పోరాడి, దేశ నాయకత్వము వహించుటకు మిగిలినవా డితడే. ఇతని పేరు అప్పటికే ఐర్లండులోను, ఇంగ్లాండులోను ప్రతిధ్వనించినది.

ఈ తిరుగుబాటులో ప్రభుత్వము చాలమందికి జన్మాంతర కారాగారవాసము లేక ఉరిశిక్షలు విధించుచుండెను. చివరకు డీవేలరా కూడ పట్టుబడిపోయెను. డీవేలరా ఓడిపోయితినని ఏమాత్రము అధైర్యము చెందక ప్రభుత్వము విధించబోవు శిక్షను అనుభవించుటకు సిద్ధముగానుండెను. ప్రభుత్వము అతికాఠిన్యము వహించి డివేలరాకు ఉరిశిక్షవిధించెను. డీవేలరా ప్రభుత్వపు ఆజ్ఞను నెరవేర్చుటకని ఉరి కంబము నెక్కెను. ఇంతలో ప్రభుత్వము విప్లవనాయకుడును, ప్రజాభిమానియునగు డీవేలరాను ఉరితీయుటకు సాహించలేక మిగిలినవారితో పాటు ఈతనికికూడ జన్మాంతర కారాగారవాసము విధించెను.

కొంతకాలమునకు ప్రభుత్వము స్వరాజ్యవాదుల నెల్లరను విడిచి పెట్టెను. వారితోపాటు డీవేలరానుకూడ విడిచివైచిరి. డీవేలరా కారాగార విముక్తుడై ఐర్లాండు చేరుసరికి ప్రజలందరు ఒక జాతీయ వీరునిగా భావించి నాయకునిగా ఎన్నుకొనిరి. వెంటనే డీవేలరా డబ్లిన్ నగరమునుండి ఎన్నికలలో కాలిడి అత్యధికబలముతో జయము నందెను. ఈ విజయముతో డీవేలరా పలుకుబడి అధికమైనది. దేశములో పలుకుబడి హెచ్చినను దేశముయొక్క కష్టములు యథాప్రకార

ముగనే యుండెను. అందుచే ఐరిష్ప్రజలు డీవేలరానాయకత్వమున స్వాతంత్ర్యముకొరకు పోరాడవలసి వచ్చెను. డీవేలరా సంపూర్ణ స్వాతంత్ర్యసంపాదనకొరకు, తీవ్రప్రయత్నము చేయుచుండెనేగాని రాజీ ఏమాత్రము పడుటలేదు.

డీవేలరా స్వదేశస్వాతంత్ర్యముకొరకు ప్రత్యేకముగా సైన్య ములను తయారుచేసెను. ప్రజలను సైన్యములోజేరుడని, పెక్కుఉప న్యాసము లిచ్చుచుండెను. డీవేలరా సముద్రతీరప్రదేశములను రాజ ధానులను కాపాడుకొనుటకు తగిన కట్టుదిట్టములుకూడ చేయుచుం డెను. బ్రిటిషుప్రభుత్వము ఇదంతయుచూచి సహించలేక, రాజీకి రమ్మనగా సంపూర్ణస్వాతంత్ర్యవాది యగు డీవేలరా దాని కిష్టపడ డయ్యెను. ప్రజలలో డీవేలరా ఇచ్చు విప్లవోద్దేశ్యములగు ఉపన్యాస ములకు 1918 లో ప్రభుత్వమువారు ఈతనిని అరెస్టుచేసి లింకన్ జైలు నం దుంచిరి.

కాని ౧౯౧౯ సంవత్సరము ౩వ తేదీని లింకన్ కారాగారము నుండి పరారైనట్లు దేశమంతటను అల్లుకొనిపోయినది. రవి అస్తమించని రాజ్యమని పేరుగాంచిన యీ బ్రిటిషుప్రభుత్వము నేడు ఒక జాతీయ వీరుని మోసములోపడిపోయినదని ప్రపంచమునకు తెలియగనే అంద రును ఆశ్చర్యపడసాగిరి. కాని ఈ మోసమంతయు డీవేలరామిత్రులగు మెకేల్ కొలిన్సు, డెరాబోలెండుగార్లు చేసి రన్నవార్త ప్రభుత్వమున కేమియు తెలియదు. డీవేలరా నివాసస్థానమునుగురించి పత్రికలు అనేకవిధములుగా వ్రాయ మొదలిడినవి. కాని వానిలో ఒక్కటికూడ నిజము కాలేదు. అతనికొరకు ప్రభుత్వము పడిన శ్రమయంతయు వృధాయాయెను.

డీవేలరా హఠాత్తుగా అమెరికాదేశములో న్యూయార్కునగర

ములో అవతరించుట చూచి ప్రజలు సంతోషపరవశులైరి. అదివరకే ప్రపంచవిఖ్యాతిగాంచిన డీవేలరా వింతలనుగురించి చెప్పుకొనుచున్న ప్రజలకు ఈతని ఆకస్మికసందర్శనము మరింత ఆశ్చర్యమును కలుగ జేసినది. అమెరికాలోని ఐర్లండుదేశీయులు డీవేలరాకు గొప్పగొప్ప స్వాగతములిచ్చి అనేకవిధముల గౌరవసత్కారముల గావించిరి.

జైలునుండి పారిపోయిన రెండువారములకు సంయుక్తరాష్ట్ర మందలి ఫిలడెల్ఫియానగరమందు ఐర్లండు హితమునుగురించి డీవేలరా "ఐరిషుజాతీయమహాసభ" యను ఒక మహాసభను గావించెను. కాని ఆ సభాఫలితము సుంద్రనిగీతయేగాని ఏమియు లేకపోయింది. ౧౯౧౯ సంవత్సరము జూన్‌మాసారంభమున డీవేలరా లింకన్ జైలునుండి మాయమైనట్లే, ఐర్లండునుండికూడ యదృశ్యమాయెను. ఆంగ్లేయుల కీసంగతి తెలియగనే డీవేలరా ఐర్లండును దాటకుండ జేయుటకు సముద్రతీరముననున్న నావలకు కఠినమైన ఉత్తర్వునిచ్చిరి.

కాని ఎట్లనో జూన్ ౨౧ వ తేదీకి డీవేలరా న్యూయార్కు జేరెను. ఆవార్త ఆంగ్లేయులకును యావత్ప్రపంచమునకును ఆశ్చర్యము కలుగజేసెను. అమెరికా వాసులందరు డీవెలరాకు ఐర్లండుస్వాతంత్ర్య సమరమునకు కావలసినంతధనము క్రుమ్మరించినారు. డీవెలరా అమెరికాయందంతటను ఐర్లండు స్వాతంత్ర్యమునుగురించి గొప్పగొప్ప ఉపన్యాసములనిచ్చి ప్రజలందరికి ఐర్లండుపట్ల సానుభూతి కలుగజేసినాడు. ఒక్క రాయబారవర్గముతప్ప అందరు ఆయనను మెచ్చుకున్నవారే. రాయబారవర్గము మాత్రము డీవెలరా ఉపన్యాసములను ఖండించుచు తీర్మానములు చేసిరి. ఏ విషయములోనైన ప్రజలలో భిన్నాభిప్రాయము లుండుట దేశసౌభాగ్యచిహ్నమే కాని మరొకటికాదు.

అమెరికాలో ప్రజాస్వామ్యప్రచారము చేయుచు డీవేలరా

స్వీయప్రభుత్వము నమలులో పెట్ట యత్నించుచుండెను. ఐర్లండులో నిరంకుశ రాజచక్రము గిర్రున తిరుగుచున్నది. నిర్బంధములు, దోపిడీలు, హత్యలు, అరెస్టులు, ఉరిశిక్షలు లెక్కకుమీరి జరుగుచుండెను. ఐర్లండులోని అత్యాచారములను నిరసింపుచు కార్కునగరపు మేయరు “టెరన్సు మెక్స్వినీ” యును, అతని అనుచరులును ఉరిశిక్షకు పాత్రులైరను వార్త అమెరికాలోని డీవేలరాకు తెలియగనే యతడు ఆంగ్ల సేనాధిపతికి ఒక ఉత్సాహమైన సందేశము నంపెను. ఇటు లీవిధముగా ఆంగ్లేయులు ఐర్లండును తమ యిచ్ఛానుసారముగా పాలించుచుండిరి.

౧౯౨౦ సంవత్సరము డిశంబరు ౨౪ వ తేదీని డీవేలరా అమెరికా నుండి తిరిగి వచ్చునప్పటికి పరిస్థితులు తారుమారైనవి. లాయడ్ జార్జి ఐర్లండుసమస్యలు పరిష్కరించుటకు ఆంగ్లో ఐరిషుసభ నొకదానిని సమావేశపఱచి డీవేలరాను ఆహ్వానించెను. డీవేలరాకును, లాయడ్ జార్జికిని ఆంగ్లో-ఐరిషు సంధినిగురించి ఉత్తరప్రత్యుత్తరములు జరిగినవి. చివరకు లండనులో సమావేశము జరిగినది. సంపూర్ణస్వాంత్ర్యవాదియగు డీవేలరా మేడిపండువలె తయారుచేసిన లాయడ్ జార్జి సంధిపత్రమునకు ఇష్టపడడయ్యెను. డీవేలరా ఎంతచెప్పినను, లాయడ్ జార్జి ఆ సంధిపత్రము తిరిగి మార్పుజేయుడాయెను. డీవేలరా ఆ సంధిపత్రమునకు తన అసమ్మతిని దెల్పుచు, ప్రజలను మోసపోకుడని హెచ్చరించుచు, పెక్కు ఉపన్యాసముల నిచ్చుచుండెను. ఒకచోట డీవేలరా ఇట్లు నుడివెను :—

“ఈ ఆంగ్లో-ఐరిష్ సంధపత్రము మన జాతీయాశయములకు పూర్తిగ ప్రతికూలమై యున్నది. ఇట్టి సంధిషరతుల నంగీకరించుటకు మారు మనకు పూర్తిస్వాతంత్ర్యము ఈశ్వరుడు ప్రసాదించువరకు బానిస

అమర్యోయుండము. ప్రపంచవిఖ్యాతులైన మహాపురుషు లెందరో జన్మించిన దేశమున జన్మించి నేడు ఈ నీచసంధి పత్రముపై సంతకము చేయుట మనజాతికి గొప్పకళంకము."

కాని దేశములో కొంతమంది స్వార్థపరులుండుటచే డీవేలరా శ్రమయంతయు బూడిదలో పోసిన పన్నీరువలె నిష్ఫలమైపోయినది. ఈ దేశద్రోహులైన స్వార్థపరులు ఆత్మగౌరవము నమ్ముకొని ఆ సంధి పత్రముపై సంతకముచేసి, నూతన ఫ్రీస్టేటు ప్రభుత్వము స్థాపించి, డీవేలరా పక్షమువారిని పలువిధముల బాధపెట్టసాగిరి. ఈ నూతన ఫ్రీస్టేటుప్రభుత్వమును నడిపినపక్షమునే "క్రాస్‌గ్రేవు" పార్టీయన్నియందురు.

"దేనికై ఇంత దృఢనిశ్చయముతో పనిచేయుచుంటిమో, దేనికై మెక్స్వినీప్రభృతులు తమ ప్రాణములను తృణప్రాయముగా దేశార్పణ చేసిరో, దేనికై భావికాలమున వృద్ధికివచ్చి దేశకళ్యాణకారకులు కాగల వీరులు వేలకువేలు ఉరికంబము నెక్కిరో, దేనికై ఐరిషుజాతి యంతయు శతాబ్దులనుండి సహింపరానికష్టములకు దురియయ్యెనో అట్టి ఐర్లండు సంపూర్ణస్వాతంత్ర్యమునకు అడ్డుతగిలిన ఈ క్రాస్‌గ్రేవుపార్టీ అధికారమున నుండువరకును, బ్రిటిషువారు సంపూర్ణస్వాతంత్ర్యమును అంగీకరించువరకును దేశమున శాంతి ఏర్పడజాలదు. నిజముగా లాయడ్ జార్జికి దేశశాంతి కావలయునన్నచో ఐర్లండు సంపూర్ణ స్వాతంత్ర్యము నంగీకరించితీరవలయునే కాని, ఐర్లండుమాత్రము ఐరిషుజాతికి అవమాన కరమైనట్టి సంధి నెన్నటికిని అంగీకరింపదు." అని ఘంటాపథముగ చాటుచుండెడివాడు డీవేలరా.

ఆసమయమున ఆంగ్లో—ఐరిషు సమాధానమును పట్టుకొని ఊగులాడుచునున్న క్రాస్‌గ్రేవు పార్టీకంటె డీవెలరాపక్షము కొంచెముగా

బలహీనముగనుండుటచే కాంగ్రెసుపార్టీ పూర్వము బ్రిటిషువారికంటె ఎక్కువ దౌర్జన్యములను చేయుచు, డీవేలరా పక్షమువారిని మరింత హింసింప దొడగెను. కాని డీవేలరా దృఢనిశ్చయుడై ఇట్లు ప్రకటించెను: "మేము ఆంగ్లేయులు ఐర్లండుపై అధికారము చెలాయించుట అసాధ్యము చేసి వైచితిమి. ఇప్పుడు బ్రిటిషువారి పెద్దబిడ్డలగు స్వార్థపరులతో గూడిన ఈనూతన ఫ్రీస్టేటు ప్రభుత్వమునుకూడ అసాధ్యము చేయగలము" అని హెచ్చరించెను.

ఇందుమూలముగా ఐర్లండులో అంతఃకలహములు బయలుదేరెను. ఒకజాతి, ఒక కుటుంబమునందుగూడ అన్నదమ్ములు రెండు పక్షములుగా విడిపోయి పోట్లాడుట కుపక్రమించిరి. ఈ అంతఃకలహములు సమసిపోయిన తర్వాత డీవేలరాపక్షము ఎన్నికలలో రెండుమార్లు ఓడిపోయినను ధైర్యము వీడలేదు, కాని కొంతకాలమునకు ప్రజలు కాంగ్రెసుపార్టీ దుర్మార్గములను గ్రహించి డీవేలరాను ఏకగ్రీవముగా ఎన్నుకొనిరి. దీనితో కాంగ్రెసుపార్టీ పతనము డీవేలరా ఆధిపత్యము స్థిరపడి పోయినవి. డీవేలరా ఐరిషుప్రజాస్వామికమునకు అధ్యక్షుడైన వెంటనే అంగ్లో ఐరిష్ సంధిని భగ్నముచేసి తన కార్యక్రమమును ప్రకటించెను. బ్రిటిషువారికిని తనదేశమునకునుగల సంబంధము ఇంతటితో పోయినదని ప్రకటించి, ఇంతకు పూర్వము కాంగ్రెసుపార్టీ బ్రిటిషువారికి కట్టుచున్న కప్పమును కట్టుటమానివేసి, దేశమంతటను సంపూర్ణ స్వాతంత్ర్య బీజములను వెదజల్లినాడు. దీనితో బ్రిటిషువారిలో కల్లోలము బయలుదేరి, ఐర్లండు వర్తకులను బాధపెట్టసాగిరి. దేశములో కొంతమంది క్రొత్తపార్టీలను లేవదీసి, కాంగ్రెసుపార్టీతో గలసి, బ్రిటిషువారిని బలపరచిరి. కాని డీవేలరా ఆపార్టీలను వెంటనే అణచివేసి, తన ఆధిపత్యమును శాశ్వతము చేసికొనగలిగెను. అష్టమ ఎడ్వర్డు చక్ర

వర్తి రాజ్యమును పరిత్యజించిన పిమ్మట, డీవేలరా ఐర్లండుకు బ్రిటిషు రాజప్రతినిధి అవసరము లేదనియు, అంతర్విషయములలో రాజుయొక్క పేరుగాని, ప్రసక్తిగాని ఉండకూడదనియు, ఆవిషయములను "డయల్ పార్లమెంటు" ప్రభుత్వ ప్రధానోద్యోగియే చూచుకొనుననియు, ఒక సవరణబిల్లును ప్రవేశ పెట్టగా, కొంతమంది కాన్గ్రేవుపార్టీ ప్రముఖులు ఆటంకము కల్గించినను, ఆసవరణబిల్లు చివరకు నెగ్గినది.

ఐరిషు స్వాతంత్రసారధియగు డీవేలరా ౧౯౧౯ లో ఐరిష్ భాషా ప్రవీణయగు "సినిమడ్ ఠపేనాగెన్" అనునామెను వివాహమాడెను. డీవేలరాకు అన్నిభాషలు వచ్చుటచే, అవి ఆమెకుకూడా నేర్ప మొదలిడెను. ఈ దంపతులకు నలుగురు కుమారులును, ఇద్దరు పుత్రికలును కల్గిరి. గత రెండు మూడుసంవత్సరములలోను ఆతని జీవితములో సంసారిక ఛిద్రము లెన్నియో కలిగెను. డీవేలరా రోజునకు ౧౮ గంటలు పనిచేయుచు ఇతరులచేకూడ పనిచేయించును. అధికారమునకును, ధనమునకును, తానులొంగిపోడు. తనకు కావలసినది ఐర్లండు స్వాతంత్ర్యము దానికొఱకై తన ప్రాణములనుకూడ ఇచ్చుటలో ఏమాత్రము వెనుదీయలేదు. చివరకు స్వదేశమునకు పూర్ణస్వాతంత్ర్యమును సాధించ కలిగెను. సేవాప్రీతినుంచి స్వాతంత్ర్య సమరమును, సేవకత్వమునుంచి నాయకత్వమును, ఉరికంబమునుంచి సింహాసనమును పొందిన డీవేలరాకు చిరాయువు కల్గునుగాక!

---

# వినాయక దామోదర సావర్కార్



భారత స్వాతంత్ర్య యోధుడగు వినాయక దామోదర సావర్కారుయొక్క జీవితము భారతీయులకేగాక ప్రపంచమంతటికికూడ గొప్ప యాశ్చర్యము కలుగజేయు ననుటకు ఎట్టిసందియమును లేదు. ఒక మహారాష్ట్ర యువకుడు బ్రిటిష్ ప్రభుత్వమును గజగజ లాడించి, అనేక కష్టములకులోనై, అర్ధజీవితమును కారాగారవాసమున గడిపి స్వాతంత్ర్య యోధుడైన చరిత్ర చదివిన ప్రతివాడును ధన్యుడగును. ఆ స్వతంత్రయోధుడే భారత స్వాతంత్ర్య సంగ్రామచరిత్ర రచించిన, వినాయక దామోదర సావర్కారు. ఇట్టియోధుడు భారతదేశమున జన్మించుటవలన ప్రతిభారతీయుడు మాతృదేశమును గురించి గర్వింపవలసిన వాడగును.

వినాయక సావర్కారు నాసికానగరప్రాంతమున భాగూరు గ్రామములో దామోదర పంతు సావర్కారు అను ఒక చిత్పవనబ్రాహ్మణునకు ౧౮౮౩ సంవత్సరమున జన్మించెను. వీరు ముగ్గురు అన్నదమ్ములగుటచే "సావర్కారు సోదరత్రయ" మను ప్రసిద్ధి గలిగెను. ఈతని అన్న గణేశ సావర్కారు. తమ్ముడు నారాయణసావర్కారు. సావర్కారు 10 సం॥ముల ప్రాయముననే తల్లిని గోల్పోయెను. ప్రవేశ పరీక్షవరకును నాశికయందే విద్యనభ్యసించెను. ౧౨ సం॥ముల ప్రాయముననే లోకమాన్య బాలగంగాధర తిలకుగారి స్వాతంత్ర్యసందేశము నాకళించి, తన్మయతజెంది, భారతదేశమునకు సంపూర్ణ స్వాతంత్ర్యమును సాధింపవలెనని బద్ధకంకణుడై తోడిబాలురలో కూడ స్వాతంత్ర్య తృష్ణను, ధైర్యసాహసములను వ్యాపింపజేయుచుండెను.

౧౯౦౮ సంవత్సరమున లోకమాన్యునకును, మరికొందరు దేశభక్తులకును విధింపబడినశిక్షలు వీరి కృతనిశ్చయము మరింత దృఢపరచెను. సావర్కారు ౧౯౦౧ సం॥న ఫర్గూసన్ కళాశాలలో విద్యార్థిగా జేరెను. విద్యార్థిదశయందుకూడ సావర్కారు శివాజి, గణపతి, మాజినీ, రామదాస్, గారిబాల్డీ ఉత్సవముల నత్యంతోత్సాహముతో నిర్వహించుచు పౌరసభల నేర్పరచి. ప్రబోధ మొనర్చుచు గొప్ప వక్తయనియు, కార్యదక్షుడనియు, దేశభక్తుడనియు ప్రసిద్ధిగాంచెను. ౧౯౦౫-౧౯౦౬ సంవత్సరమున స్వదేశీయుద్యమమున అద్భుతమగు ప్రచారమొనర్చి విదేశ వస్త్ర దహనము మొట్టమొదట ప్రారంభించెను. కళాశాలాధికారులిందుకు కుపితులై జరిమానా విధించి వసతిగృహమునుండి వెడలగొట్టిరి. ఆ సంవత్సరమున సావర్కారు విశ్వవిద్యాలయమున పట్టభద్రుడాయెను. అచ్చటనుండి లోకమాన్యుని ప్రయత్నమువలన శాంజీకృష్ణవర్మ గారివద్దనుండి విద్యార్థి వేతనము సంపాదించి ౧౯౦౬ సంవత్సరమున బారిష్టరు పట్టమునందుటకుగాను, ఆంగ్లదేశమునకు జనెను.

లండనునగరము చేరుసరికి అతనికీర్తి విని, లండనులోని భారత విద్యార్థులితనికి స్వాగతమిచ్చిరి. హోంరూలులీగు నాయకులగు శాంజీ కృష్ణవర్మ గారునూ, ఆక్సుఫర్డు, కేంబ్రిడ్జి, ఎడింబరో, మాన్చెష్టరులలో; భారతీయ విద్యార్థులందరును త్వరలోనే ఈ విప్లవసిద్ధాంతములను శిరసావహించిరి, శాంజీకృష్ణవర్మ గారు బాంబును గురించియు, రష్యను రహస్య సంఘములను గురించియూ దినపత్రికలలో వ్రాసి, హోంరూలు లీగును మూనివేసి, పారిసునకు వెడలిపోయిరి. అప్పుడు లండనులోనున్న "భారతగృహము" సావర్కారు యాజమాన్యము క్రిందకువచ్చెను.

సావర్కారు లండనువెళ్లినతరువాత అచట అభినవభారతసంఘమను పేరుతో నొక విప్లవసంఘము నేర్పరచెను. వినాయకదామోదర సావర్కారును ఆసంఘమునకు అధ్యక్షులుగను, కీ॥ శే॥ వి. వి. యస్.

అయ్యరుగారిని ఉపాధ్యక్షులుగను నియమించిరి. లండనులో సావర్కారు ఈ సంఘము పేరిట ప్రతివారమును బహిరంగసభలను జరిపి అద్భుతమైన ఉపన్యాసముల నిచ్చుచుండెడివాడు. ఈ అభినవభారత సంఘసభ్యులు ఆంగ్లదేశమునందలి విద్యార్థులలో విప్లవపద్ధతులగురించి ప్రచార మొనర్చుచుండిరని పోలీసువారి రిపోర్టులద్వారా భారతదేశమునకు తెలియుచుండెను.

ఈ రోజులలోనే సావర్కారు "భారతస్వాతంత్ర్య సంగ్రామము" అను పేరుతో ౧౮౫౭ సం॥పు భారతీయుల తిరుగుబాటు యొక్క చరిత్రను వ్రాసెను. వ్రాత యింకను ముగియకపూర్వమే ప్రభుత్వమువారు దీనిని నిషేధించినను, విదేశములవారీగ్రంథము ప్రకటింప భారతదేశమునకుకూడ చాలప్రతులు వచ్చెనట.

ఈ స్వాతంత్ర్యసంగ్రామచరిత్రనే పాఠశాలలలో విద్యార్థులకు "సిపాయిలకలహము" అనుపేరట తప్పుడు తడికెలతో చెప్పుచుందురు. కాని, సావర్కారు ఈ భారతస్వాతంత్ర్యసంగ్రామచరిత్రను నిష్కర్షగాను, నిజముగాను ఆంగ్లదేశమందలి రికార్డులను చూచి విమర్శించుచు వ్రాసెను. అందుచేతనే ప్రభుత్వమువారీగ్రంథమును నిషేధించిరి. ఇతడు ఇటలీ విప్లవనాయకుడగు మాజినీజీవితచరిత్రనుకూడ మహారాష్ట్రభాషయందు రచించెను. ౧౯౦౭ సంవత్సరమున ఆంగ్లదేశమున కొందరు ౧౮౫౭ సం॥పు భారతీయుల తిరుగుబాటు చరిత్రను సంస్మరించుటకు గొప్ప అర్ధశతాబ్దోత్సవముల నేర్పరుపగా సావర్కారపుడు అచ్చటనేయుండి ఆ యుద్యమమును జయప్రదముగా జరిపించెను.

ఈ అభినవభారతసంఘసభ్యులు విప్లవము నిమిత్తము బాంబులు తయారుచేయుటకు అనేక ప్రయత్నములు చేయుచుండెడివారు. అభినవభారతసంఘసభ్యుడగు నొక పట్టభద్రుడు తన విశ్వవిద్యాలయపు చదువు

నకు స్వస్తి చెప్పి రష్యావెళ్లి బాంబులు తయారుచేయు విధములను నేర్చుకొని. "జారు ప్రభుత్వమును రష్యనులు డీకొనినట్లే, నేనును భారతదేశములోని నిరంకుశ ప్రభుత్వమును డీకొనెదను" అని శపథము చేసెనట.

౧౯౦౯ సంవత్సరమున గణేశ సావర్కారునకు విధింపబడిన యావజ్జీవశిక్షకు ఆగ్రహోద్రేక పూరితుడైన "ధింగ్రా" అను భారతీయ విద్యార్థి లండనులో కర్జన్ విల్లీగారిని రివాల్వరుతో కాల్చి చంపెను. ధింగ్రాగారి చర్యను ఖండించుచు తీరుమాన మొనర్చుటకు సురేంద్రనాథ బెనర్జి, బిపినచంద్రపాలు మొదలగువారు లండనులో పెద్ద బహిరంగసభ చేయుగా సావర్కారొక్కడే ఆ తీర్మానమును ప్రతిఘటించెను. అపుడు సభ్యులలో చాలమంది సావర్కారును విమర్శించుచు సభలో గందరగోళము చేసిరి. ఆ సమయములో ఒక యూరేషియన్ ముందుకురుమికి, సావర్కారు ముఖముపై ఒక కఠినమైనదెబ్బను కొట్టినను సావర్కారు ఏమియు చలింపక తనమిత్రులతో ఆ యూరేషియనును ఏమియు చేయవలదని చెప్పెను. కాని, వెంటనే మరొకనిచేత ఆ యూరేషియను చావక తప్పినదికాదు. ఇంతఅలజడి, దౌర్జన్యము జరిగినను సావర్కారు ఒక్కడు ఆతీర్మానమునకు వ్యతిరేకముగ నోటు చేసెను.

౧౯౧౯ సంవత్సరమున సావర్కారు పరీక్షయందు త్తీర్ణుడయ్యెను. అయినను రాజద్రోహోద్యమములయందు పాల్గొనని వాగ్దాన మొనర్చిన నే తప్ప బారిష్టరుపట్టము నొసంగమని, నిరాకరించిరి. ఈ సమయముననే నాసిక జిల్లాకలెక్టరును కూనీచేసెనను నేరమునకును, రాజప్రతినిధిపై బాంబును వేసినను నేరమునకును వినాయక సావర్కారు తమ్ముడగు నారాయణ సావర్కారును నాసికలో అరెస్టుచేసిరి. ఆంగ్లదేశమున వినాయక సావర్కారునుకూడ అరెస్టు చేసెదరని తెలియవచ్చుటచే

అచటనున్న మిత్రులీతని బలవంతముగా పారిసుకు పంపిరి. పారిసునందు ఇతడు సుప్రసిద్ధ భారతదేశ భక్తురాలగు "కామాసతి" గారియింట నివసించుచుండెను. ఆమెకూడ విప్లవోద్యమమూనజేరి, సావర్కారు కనేక విధముల తోడ్పడెను. కాని తాను విదేశములందుండుట కిష్టము లేక, కామాసతి ఎంతవారించినను వినక, ఒక సి. ఐ. డి. లేఖకు మోస పోయి వినాయక సావర్కారు కొలది రోజులకే లండను తిరిగివచ్చెను. వచ్చినతోడనే రైలుస్టేషనునందే ఆంగ్లదేశపు పోలీసువారితనిని అరెస్టు చేసి, భారతదేశమునకు పంపించిరి. ఆంగ్లదేశమునుండి భారతదేశము నకు వచ్చువారు పరాసు దేశముగుండా మార్సెయిల్సువచ్చి స్టీమరెక్కు దురుగాని, సావర్కారు నామార్గమున గొనివచ్చినయెడల, పరాసు న్యాయస్థానములు అడ్డుతగులునను భయముతో సముద్రమువిూదనే ప్రయా ణము చేయించిరి. కాని జిబ్రాల్టరు దాటినపిమ్మట స్టీమర్లు మార్సెయిల్సు రేవును ప్రవేశింపక తప్పదు.

స్టీమరు మార్సెయిల్సునుండి తిరిగి బయలుదేరుటకుముందు సావ ర్కారు తనకు కాపలాయున్న సాయుధభటులనుండి తప్పించుకొని, స్వాతంత్ర్యము బడయుట కొనర్చిన సాహసకృత్యమువలన ప్రపంచ మంతయుగూడ నివ్వెర వందజేసెను. స్టీమరులో ఖైదియగు సావ ర్కారువద్ద నిరంతరము సాయుధరక్షక భటులుండిరి. పరాసుదేశపు రేవగు మార్సెయిల్సును దాటినచో తప్పించుకొనుట కష్టమనితలచి, సావర్కారు స్టీమరునుండి ఎటులైనను తప్పించుకొని పరాసుభూమిని ప్రవేశింపవలెనని యుద్దేశించి అల్పాచమానమునకని రక్షకభటునితో చెప్పి, అందు కుద్దేశింపబడిన గదిని ప్రవేశించి, అందుగల చిన్నరంధ్రము గుండాదూరి, సముద్రరేవులోని కురికెను. రక్షకభటుడు దీనినిగని పెట్టి తుపాకి ప్రేల్చెను. చాలామంది వెంటదుమికిరి. సావర్కారు అస్వస్థ

తగానుండియు, అతివేగమున ఆసముద్రములో ఈదుకొనిపోయి, ఎత్తైన హార్బరుగోడనెక్కి పరాసుభూమిని ప్రవేశించి మార్సెయిల్సు వీధుల గుండా "పోలీసు," "పోలీసు," అని కేకలు పెట్టుకొనుచు పరుగెత్త దొడగెను.

అతని వెంటబడిన ఆంగ్లాధికారులు, రక్షకభటులు, ఇతరులుగూడ పరాసుభూమిని ప్రవేశించి తిరుగజొచ్చిరి. ఒకమైలుదూర మావిధముగ పరుగెత్తిన పిమ్మట, అలసిపోయి, ఒక పరాసురక్షకభటుడు కనబడగా, వాని శరణుజొచ్చి, తాను బ్రిటిషు రాజకీయనిర్బంధితుడ ననియు, వెంటబడినది బ్రిటిషు రక్షకభటులనియు దెలిపి, తనను పరాసు భూమిలో పట్టుకొనుట బ్రిటిషువారి కధికారము లేదనియు, తనను మేజస్ట్రేటువద్దకు తీసికొనిపోవలసినదనియు చెప్పెను. కాని అత డావిషయములను పాటించక, ఆంగ్లేయులిచ్చిన ధనమునకు లొంగిపోయి, సావర్కారుని పట్టుకొని బ్రిటిషు అధికారుల కప్పగించెను.

మార్సెయిల్సు పట్టణవీధులగుండ పరువెత్తుతూ, తానే స్వయముగ మేజిస్ట్రేటును కలిసికొని, పై విషయము నతనికి తెలియజెప్పి, తప్పించుకొన చూచెనుగాని, చేతిలో పైసకూడ లేనికారణముచే ట్రాముల నుపయోగింపలేకపోయెను. తఱుముకొనివచ్చు భటులను తప్పించుకొనజాలకపోయెను. స్వీయచరిత్రమునందు ఈత డిట్లు వ్రాసెను:

"ఆసమయమున నా భవిష్యత్తంతయు ఒక అణాడబ్బులపై నాధారపడి యుండెను. అది యున్నచో ట్రాముపై తప్పించుకొని యుండెడివాడను".

తరువాత, సావర్కారును పరాసుదేశమునుండి తీసికొని వెళ్లిరని, పరాసు ప్రభుత్వమునకు తెలియగనే, పరాసు, ఆంగ్లప్రభుత్వములకు వివాదము జరిగి, హేగునందలి అంతర్జాతీయ న్యాయస్థానమువారి పరి

ష్కారమునకు పంపించిరి. కాని అప్పటి అంతర్జాతీయ పరిస్థితులవలన పరాసుప్రభుత్వమువారు బ్రిటిషు ప్రభుత్వమువారికి విరుద్ధముగ గట్టి ప్రయత్న మొనర్పజాలకబోయిరి. భారతీయుడైన సావర్కారును గురించి ఫ్రెంచి బ్రిటీషు ప్రభుత్వములు రెండును తీవ్రముగా పోట్లా డుటవలన సావర్కారు ప్రఖ్యాతి ప్రపంచమున కంతకు విదితమాయెను.

బ్రిటిషు అధికారులు సావర్కారును బొంబాయికి తీసుకొనివచ్చి ఆతనిని, అతని తమ్ముడగు నారాయణ సావర్కారును, మరి ౨౦ మందిని కుట్ర నేరమునకుగాను విచారణకు బెట్టిరి. వినాయకసావర్కారు భారతదేశమున బ్రిటీషు ఆధిపత్యము నంగీకరింపనని తెలుపుచు, విచారణయందు పాల్గొన నిరాకరించెను. తుదకు ౧౯౧౦ సంవత్సరమున సాయుధ విప్లవమును లేవదీయుటకు కుట్రపన్ని ప్రయత్నించెనను నేరమునకును, నాసికజిల్లా కలెక్టరగు జాక్సనుగారి హత్యతో వీరికి కూడ సంబంధము కలదను నేరమునకును, వీరికి నాసిక పట్టణమున ప్రత్యేకన్యాయస్థానమువారు యావజ్జీవద్వీపాంతరవాస శిక్షను విధించిరి. అప్పటనుండియు సావర్కారు అండమానులు మొదలగు ద్వీపాంతరములలోను, ఇతర కారాగారములలోను సుమారు ౨౦ సంవత్సరములు శిక్ష ననుభవించిరి. అటుపిమ్మట సుమారు ౬ సంవత్సరములకు పూర్వము అనగా ౧౯౩౦ సంవత్సరమున కారాగారమునుండి వదలిపెట్టిరి. కాని రత్నగిరియందొక యింటియందు నివసింపవలె ననియు, ఇతర ప్రదేశములకు పోరాదనియు, అధికారుల అనుమతి లేనిదే ఏ యుద్యమమున పాల్గొనరాదనియు మొదలగు నిర్బంధములను విధించిరి. ఈ విధముగా సావర్కారు, భారతమాతను చెరనుండి విడిపించుటకై, తాను చెరయందుండి, అనేక కష్టములకు గురియయ్యెను.

సావర్కారు తన విడుదల విషయమై జరిగిన విశేషమగు ఆందోళనను విని ఇట్లు గర్వపడుచు పలికెను.

"ఇప్పటికి నేను ధన్యుడనైతిని, నా విడుదల విషయమై నా కెట్టి చింతయులేదు కాని నానిర్బంధము ఆంగ్ల ప్రభుత్వమును గజగజలాడించి, నా యభినవభారత సంఘాధ్యక్షపదవిని సార్థకముచేసినదని నేనెంతయో గర్వపడుచున్నాను. ఇటాలియను, రష్యను విప్లవనాయకుల సాంప్రదాయమున కిది ఎంతమాత్రము తీసిపోవునదికాదు. ఇప్పటికి నా ఆత్మ శాంతించినది".

సావర్కారు విడుదలనిమిత్తమై, భారతదేశము అనేకవిధముల ప్రయత్నించెను. ప్రతి రాష్ట్రములోను సావర్కారు విడుదలను గురించి తీరుమానములు జరిగెను. గవర్నమెంటుకు ప్రజలు మహజరులు పంపిరి. ఆంధ్రమహాసభలలోనేకాక, భారత కాంగ్రెసు సంఘుసమావేశములో కూడ సావర్కారు విడుదలనుగురించి తీర్మానించి, ప్రజలు "సావర్కారు వారములు"ను జరిపి తీవ్రాందోళన చేసిరి. కాని ఇవి యన్నియు, బూడిదలోపోసిన పన్నీరువలె నిష్ఫలము లాయెను. బ్రిటిషు గవర్నమెంటు వీటి నన్నిటినికూడ త్రోసిపుచ్చెను.

భారతదేశమునకు సంపూర్ణస్వాతంత్ర్యమును సాధించుటకుగాను, విప్లవోద్యమమును జరుపుటకై యత్నించిన అభినవభారతసంఘాధ్యక్షుడై నట్టియు, భారతస్వాతంత్ర్య విప్లవోద్యమము రోజులలో భారతదేశమునందేకాక విదేశములందుకూడ ధైర్యసాహసములకు పేరు మ్రోగినట్టియు, రవి అస్తమించని విశాలరాజ్యమన బరగిన బ్రిటిషు ప్రభుత్వమును గజగజలాడించిన వినాయక దామోదరసావర్కారు ౧౯౩౭ సం॥ మే ౧౧ వ తేదీని విడుదలయ్యెననువార్త యావద్భారతదేశమును, సంతోషమున తేలియాడించెను.

విడుదలైనవెంటనే కాంగ్రెసునందు చేరవలయునని మిత్రు లనేకులు సావర్కారు నాహ్వానించిరిగాని, వారు కాంగ్రెసుకార్యక్రమము

నిబంధనలయందుగల కొన్ని యభిప్రాయభేదములచే, చేరజాలనని బదులిచ్చెను. నేడు హిందూమహాసభాధ్యక్షుడుగ నుండి, హిందువులను హిందూమతమును మతాంతరుల దాడినుండి తప్పించుటకు బద్ధకంకణుడై దీక్షతో పని చేయుచున్నాడు.

ఇట్టి ధీరుడైన సావర్కారును చూచిన ప్రతి క్షణమును ఏప్రభుత్వమువారికైననుసరే, భయము వేయుచుండును. ఇట్టి విప్లవకారుని విప్లవచేష్టలను ఆదర్శముగా గైకొనమని పాఠకమహాశయులకు నేను జెప్పుటలేదు. భారతమాతగర్భమున జన్మించి తన వీర్య, శౌర్య, ప్రతాపశక్తులచే ప్రపంచవిఖ్యాతిజెందిన వినాయక సావర్కారు భారతీయుడైనందులకు గర్వించుచు ఇతనివలెనే ప్రతి భారతీయుడు ఆ వీర్య, శౌర్య, ప్రతాపశక్తులను గలిగి భారతదేశస్వాతంత్ర్యమునకై దౌర్జన్య రహితపద్ధతులలో ఆశక్తులను ప్రజ్వలింపజేయుచు సర్వత్యాగ మొనర్చుటకుకూడ వెనుదీయకుందురుగాక, యనియే నాయాశయము.

---

## ముస్తఫా కెమాల్ పాషా.

ముస్తఫా కెమాల్ పాషా తన జాత్యుద్ధరణకొరకు తన జీవితమునుకూడ లెక్కజేయక, యుద్ధరంగమునందు సేనానాయకత్వము వహించి, స్వయముగా యుద్ధముచేసి, స్వదేశగౌరవము కాపాడి, నేడు సామ్రాజ్యమున కంతకు ఏకఛత్రాధిపత్యము వహించగలిగిన వీరుడు. టర్కీసామ్రాజ్యము ఐరోపాక్రైస్తవుల హస్తగతముగానున్న సందిగ్ధ సమయమున మహాత్మునివలె నుద్భవించి ధీరుడై నిలువబడి కెమాల్ పాషా వీరుడు మహమ్మదీయ ప్రపంచఖ్యాతిని గాపాడగల్గెను. ఈధీరుడు

టర్కీ సామ్రాజ్యమును కాపాడుటయేగాక, తద్వారా తూర్పుప్రపంచము నంతను పాశ్చాత్యుల దాడినుండి తొలగించి, నల్లజాతుల ప్రాముఖ్యతను బాగుగా స్ఫురణలోనికి దెచ్చెను. పాశ్చాత్యులు ప్రపంచ శాంతిని నెలకొల్పెద మని చెప్పుమాటలు వట్టిబూటకములని చాటగలిగిన ఈ మహావీరుని చరిత్ర తెలిసికొనుట ప్రతివాని కర్తవ్యము.

కెమాల్ పాషా టర్కీదేశమున సాలనీకా పట్టణమున ఆలరిజ జుబేడాలకు ౧౮౮౧-వ సంవత్సరమున జన్మించెను. ఇతని తండ్రియగు ఆలరిజ సాలనకాలో ఒక చిన్న యుద్యోగి. చాల బీదకుటుంబము. కెమాల్ పాషా చిన్నవయసున నే తండ్రి మరణించెను. స్టాలిన్ తల్లివలె పాషాతల్లికూడ కొడుకునకు మతవిద్య చెప్పింప నుద్దేశించెను. కాని పాషా బాల్యమునుండియు సైనిక విద్యయందు అభిలాషకలవాడాయెను. కెమాల్ అతిత్వరలోనే సైనికవిద్యనభ్యసించి ఉత్తీర్ణుడాయెను. ఇతని ఉపాధ్యాయుడు, ఈతని మేధాశక్తికి మెచ్చుకొని "కెమాల్" అను బిరుదమును ఇచ్చెను. "కెమాల్" అనగా టర్కీభాషలో "సత్యసమ్మతము" లేక సక్రమము అని అర్థము. అప్పటినుంచియు ఈతనికి కెమాల్ సార్థకనామమాయెను.

ఇరువదిరెండవ యేటనే, సైన్యమునందొక సేనాని ఉద్యోగములో ప్రవేశించెను. ఆరోజులలో సుల్తాను అబ్దుల్‌హామీద్ ప్రభుత్వముపై నొకవిధమగు ఏవగింపు ప్రజలలో కలిగెను. సుల్తాను స్త్రీలోలుడై మద్యపానము విశేషముగా చేయుచు, రాజ్యతంత్రమును మంత్రిచేతులలో పెట్టియుండి, తాను తన యిచ్చానుసారము చేయుచుండెను. యువకులలో స్వాతంత్ర్యేచ్ఛ రగుల్కొన సాగెను. యువకులు దేశమునందంతటను సంఘము లేర్పరచుకొని ఆసంఘసభలలో నిరంకుశ పరిపాలనను గర్హించుచు, అట్టి యధర్మప్రభుత్వమును రూపుమాపు

టకు ప్రయత్నించుచుండిరి. అట్టి సంఘములలో కెమాల్ కూడ సభ్యుడై సుల్తాను చేయుచున్న అక్రమములను తీవ్రముగా ఖండించుచు, ఉపన్యాసము లిచ్చుచుండెను. ఈతని కిట్టివిప్లవ సంఘములతో సంబంధమున్నట్లు ప్రభుత్వమునకు తెలిసి, ఈతనిని యుద్యోగమునుండి తొలగించి, మూడు నెలలు జైలునందుంచిరి. చాలమంది సంఘసభ్యులనుకూడ జైలునకు పంపిరి. కాని కెమాల్ పాషా ఎటులనో తప్పించుకొని, మరల కాన్‌స్టాంట్‌నోపిలులో ఉద్యోగమున ప్రవేశించెను. కెమాల్ ౧౯౦౭ లో కాన్‌స్టాంటినోపిలునుండి సాలనీనాకు బదలాయింపు చేయించుకొని అచ్చట విప్లవసంఘము నొకదానిని స్థాపించెను. ఈ సంఘమువలన కెమాల్ పాషా దేశమున గొప్ప పలుకుబడి సంపాదించి క్రమముగా దేశమునం దధికారము వహింపసాగెను. ౧౯౦౯ సంవత్సరములో, సుల్తానుపై కెమాలు నాయకత్వమున నొక తిరుగుబాటును జరిగెను. సుల్తాను దానిని అణచివేసెను. కాని చాలనష్టమును పొందెను.

ప్రతిదానియందును ముస్తఫా కెమోల్ పాషా నాయకత్వము వహించుటయు, ఇతని పలుకుబడి దినదినాభివృద్ధి గాంచుటయు చూచి చాలమంది అసూయ పడుచుండిరి. అదే సమయములో సుల్తాను అబ్దుల్ హమీద్ గారిని త్రోసివేసి, యన్వరు పాషాయే సుల్తానయ్యెను. కెమాల్ పాషాపై అసూయబూని నతని చంపించుటకు ప్రయత్నములు చేసినవారిలో యన్వరు ఒకడు. క్రొత్తసుల్తాను కెమాల్ పాషా నణచదలచి, యతనిని ట్రిపోలీ (అఫ్రికా) యందు చెలరేగిన విప్లవము నణచివేయుటకు కొంతసేన నిచ్చిపంపెను. ఆవిప్లవము నణచుట కెమాల్‌కు చేతకాదను నుద్దేశముతో బంపెను. కాని కెమాల్ విప్లవ వీరులను సునాయాసముగా జయించి టర్కీకి మరలెను. సుల్తాను ఇతని శక్తికి మెచ్చి ౧౯౧౦ లోసైన్యములో నొక గొప్ప యుద్యోగము నిచ్చెను.

౧౯౧౪ సంవత్సరములో ప్రపంచ మహాసంగ్రామము ప్రారంభ మాయెను. ఇంగ్లీషువారు టర్కీపక్షమును విడిచి, రష్యాతో గలియుం టచే సుల్తాను జర్మనీతో సంధి జేసుకొనెను. ఇది కెమాల్‌పాషాకు గాని, వాని అనుచరులకుగాని, ఎంతమాత్రము యిష్టములేదు. కెమాల్ టర్కీ నెంతమాత్రము యుద్ధములో దింపవద్దని చెప్పినను సుల్తాను విన లేదు. అందుచే కెమాల్ తన యుద్యోగమును విడిచి కాన్‌స్టాంటు నోపిలునకు వెడలిపోయెను.

కెమాల్‌న కిష్టము లేకపోయినను మరల నాహ్వానించి సుల్తాను ఇతనికి కొంతసైన్యమునిచ్చి డార్డినలు జలసంధియొద్ద కంపెను. జర్మన్ సైన్యాధిపతి కెమాల్‌కు సర్వసైన్యాధిపత్యము నిచ్చుటకు నంగీకరించ లేదు. మిత్రమండలివారు కాన్‌స్టాంటు నోపిలుమీదకు దండెత్తివచ్చు చుండ, జర్మసైన్యాధిపతికి అధైర్యముపుట్టి, టర్కీ సర్వసైన్యాధికార మును కెమాలునకు వప్పజెప్పెను. వెంటనే కెమాల్ సర్వసైన్యాధి కారము వహించి బలిష్టమగు బ్రిటిషువారిని 'అనపోర్టావద్ద' నెదు ర్కొని వెనుకకు పంపించగల్గుటచే మిత్రమండలివారి ఆశలు నిరాశలై పోయినవి. దీనితో డార్డనలు జలసంధి సురక్షితముగా నుండెను. ఈ విజయమునకే ముస్తఫా కెమాల్‌కు "పాషా" అని బిరుదునిచ్చి విజయానంతరము జర్మనీ, టర్కీదేశములు ఈతనిగురించి, ఎంతయో వింతగా జెప్పుకొన సాగినవి. కాని కెమాలునకింత కీర్తి వచ్చుట యన్వరు పాషాకు గిట్టినదికాదు. అసూయ పెరిగిపోవుచుండెను.

కెమాల్‌పాషా యఖండవిజయమునకు కండ్లుకుట్టి జర్మనుసేనాని ఇతని నచ్చట నుంచక ఇతనిని రష్యాప్రాంతముల కంపెను. అచ్చట జర్మను ఉద్యోగియగు ఫాల్కనుహాయునకును ఇతనికి "బాగ్దాద్" ను బ్రిటిషువారినుండి తిరిగి స్వాధీనపరచుకొను విషయములో భేదాభిప్రా

యములువచ్చి ఇతడు తనపదవికి రాజీనామా నిచ్చి స్వదేశమునకు మరలెను. కాని సుల్తాను అతనిని జర్మనీకి వెడలగొట్టెను. కాని పాలస్తైను ప్రాంతములను వశపరచుకొను సమయమున మరల కెమాల్ అవసరము కలిగి ఇతనికి సుల్తాను కబురంపెను. స్వదేశరక్షణ పరాయణుడగు కెమాల్ పాషా యాతనిమాటను త్రోసిపుచ్చక, పాలస్థైను ప్రాంతములకువెళ్లి సేనానాయకత్వ వహించునప్పటికి పూర్వసేనాధిపతి, మిత్రమండలివారికి లోబడి, తాత్కాలికసంధి చేసుకొనెననువార్త, కెమాలునకు తెలిసెను. ఇతనికి పిడుగు పడినట్లుండెను.

అప్పటికి తురుష్క రాజ్యపు అంతరంగిక వ్యవహారములు చాల గందరగోళములో పడియుండెను. కెమాల్ పాషాచే స్థాపింపబడిన జాతీయసంఘము తారుమారై చెదరిపోయెను. మూలమూలలనుండి వారి ప్రత్యర్థులు తలలెత్తి "డామెడ్ ఫెరిదుపాషాను" సుల్తాను పదవికి తీసుకొని రావలెనని యత్నించుచుండిరి. పార్లమెంటె సభయధికార భ్రష్టమయ్యెను. ప్రభుత్వ నిర్వహణమునకు తగిన నాయకుడులేక దేశ మరాజక మగుచుండెను. అన్నిదేశములవారును ఎవరికి చిక్కిన స్థలములను వారు వశపరచుకొను చుండిరి. తురుష్క సేనలన్నియు చెల్లాచెదరయ్యెను. కెమాల్ పాషా తిరిగి రాజధానికివచ్చి చూచుసరికి మహానగరము శోభావిహీనముగ నుండెను. ఈ పరిస్థితులలో రాజధానియందు తానేమియును చేయునదిలేక తానుకూడ విరోధిచేతులలో చిక్కకుండ కెమాల్ పాషా స్వదేశమునువిడిచి ఆసియా మైనరుకు వెడలి పోయెను.

అచ్చట నొక నూతన రాజ్యాంగమును నిర్మించి, తద్వారా సుల్తానుచే తిరిగి పార్లమెంటుసభను సమావేశపరుప యత్నించుచుండెను. ఆసియామైనరులోకూడ నీతడు అతివేగముగ పలుకుబడి సంపాదించెను.

ఫెరిడ్ పాషా స్వీయనిరంకుశాధికారమునకు భంగము వాటిల్లునని తలంచి వెంటనే కెమాల్‌ను ఆసియామైనరునుండి రమ్మనెను. కెమాల్ పాషా అతని ఆజ్ఞను నిరాకరించెను. అందుచే ఇతనిని సైనికోద్యోగమునుండి వెడలగొట్టిరి. అన్వరు పాషాకూడ నెప్పుడు చేయని ఇంత సాహస కృత్య చేసియుండుటచే దేశమున రెండుపార్టీ లేర్పడెను. కెమాల్ పాషా పక్షమువారికి కెమాలిస్టులని పేరు. సుల్తానుపక్షము వారు కెమాలిస్టులను పెక్కుమందిని అరెస్టుచేయసాగిరి. తురుష్కసామ్రాజ్యము అధోగతిపాలై యున్న సమయముననే దేశమునం దిట్టి తీవ్రముగు కక్షలు పెరిగినవి.

ఇంతలో ౧౯౧౯ సం॥ మే ౧౫-వ తారీఖున, గ్రీకులు స్మర్నా నగరమును ఆక్రమించుకొనిరి. గ్రీకు-ఆంగ్లో మైత్రియొక్క ప్రబల ప్రమాదమును నేటికి సుల్తాను పక్షమువారు గ్రహించి కెమాల్ పక్షమున జేరిరి. సుల్తానుగూడ గ్రీకు-ఆంగ్లో మైత్రికి భయపడి ఆసియా మైనరును పూర్తిగా కెమాల్ పాషా చేతియందుంచెను. ఈ విధముగ కెమాల్ పాషా ఆసియామైనరుకు సర్వాధికారియాయెను.

కెమాల్ పాషా జాతీయప్రభుత్వము స్థాపించువరకును తురుష్క దేశపరిపాలనావిధానము వర్ణింపనలవికాని దుర్దశలో నుండెను. దేశమునందు ధనముగాని, సైనికులుగాని, యుద్ధసామగ్రిగాని లేకుండెను. ఇది లేనిదే ఏ ప్రభుత్వమును పరిపాలన చేయజాలదుగదా! సైన్యమంతయు నొకచోట లేకుండెను. సుల్తాను గ్రీకు-బ్రిటిషువారి చేతులలో కీలుబొమ్మవలె వారాడించిన ట్లెల్ల నాడుచుండెను. అప్పటి ప్రభుత్వము ఆత్మగౌరవమును గోల్పోయి, స్వాతంత్ర్యమును మరచి, దాస్యభావమునం దుల్లాడుచుండెను. అట్టి ప్రభుత్వమును బాగుచేయవలెనన్న ఆ ప్రభుత్వ నాసనకూడ లేకుండచేయవలెను. ఆ కార్యమును సాధించుటకు

కెమాల్ ధీరుడే సమర్థుడు. దేశమునకు తగిన నాయకుడు లేకుండుటచే ఆ పదవిని కెమాల్ పాషాయే నిర్వహించవలసి వచ్చెను. వెంటనే కెమాలు జాతీయోద్యమమును సాగించి బ్రిటిషువారు స్వాధీనపరచుకొన్న సులానును, తిరిగి తాను వశపరచుకొనజూచెను. తురుష్కదేశమున సుల్తానే మతగురువు. అతనిని 'కలీఫా' అందురు. అతనిని వశపరచుకొనక దేశమును సంస్కరించుట మహాకష్టము.

కెమాల్ పాషా ౧౯౧౯-వ సంవత్సరము మే ౧౨ తారీఖున గ్రీకులు స్మర్నానగర మాక్రమణసమయమున "ముద్రోసు" తాత్కాలికసంధిషరతుల నుల్లంఘించి, యొక నూతనజాతీయసంఘము నేర్పరచి, పన్రెండుగురు సహచరులతో, ఒక పరిపాలనావిధానమును తయారుచేసి, కాన్‌స్టాంటినోపిలు పార్లమెంటుకు పంపెను. సుల్తాను పార్లమెంటుకు దానికి అంగీకరించెను. బ్రిటిషువారు చాలఆటంకములను గల్గించినను, జాతీయవీరులందరును, అంగోరాలో కలిసి ౧౯౨౦ సం॥ మార్చి ౨౩ వ, జాతీయ పార్లమెంటును స్థాపించిరి. ఈ జాతీయవాదులు పైప్రణాళికను దేశమందు అమలుజరుపు ప్రయత్నములనుచేసిరి. అప్పటికి కెమాల్ పాషా సామాన్యసేనానిగా మాత్రమే గాక, విరోధిచేతులలో బడగా మిగిలియున్న తురుష్కసామ్రాజ్యమున కంతకును మహానాయకుడుగానుండెను.

ఇట్టి పరిస్థితులలో మిత్రమండలివారు ఫెరిడ్ పాషాచే "సేవర్సు" (Severse) సంధిషరతులపై సంతకము చేయించిరి. కాని ఆయన కా షరతులను చెల్లించు సామర్థ్యము స్వదేశమునందు లేకుండుటచే ఆ ఫెరిడ్ పాషాను అధికారమునుండి తొలగించిరి. ఈ సంధిషరతులు నెరవేరుచో ప్రాచీన తురుష్కప్రభుత్వ మంతరించుటే గాక టర్కీ దేశమే అంతరించును.

కాని కెమాలు ధీరుడు. ఈ సంధిషరతులను అంగీకరించక పూర్తిగా నాశనముచేయుటకు నిశ్చయించెను. సాధ్యమైనన్ని సేనలను సమకూర్చి గ్రీకుసేనలను, బాగ్దాదు సరిహద్దులు దాటి రాకుండ జేయుటకు హోరాహోరీగా యుద్ధముచేసెను. చివరకు విజయలక్ష్మి కెమాల్‌నే వరించెను. కెమాల్‌పాషా విజయపరంపరలలో నిది రెండవది.

స్మర్నా, కాన్‌స్టాంటినోపిలు పట్టణములు గ్రీకులచే నాక్రమింపబడెను. వీరిని కెమాల్ ధైర్యముతో నెదుర్కొని పూర్ణవిజయమును బడసెను. వెంటనే అచ్చట కెమాలిస్టు ప్రభుత్వము స్థాపించెను. కాని గ్రీకులు స్మర్నానగరమును విడిచిపోవునప్పుడు, అనేక ఘోరకృత్యములు చేసిపోయిరి. ఈ గ్రీకులు చేసిన స్మర్నా నష్టములు సుమారు ౧౫ లక్షల సవరను (Sovreiegn) లుండునని యంచనా వేయబడెను.

పిమ్మట తురుష్క సేనలు స్మర్నాప్రాంతముల నాక్రమించుకొని "డార్డనల్సు" జలసంధులపైకి దాడివెడలినవి. కెమాల్‌పాషా తన సైన్యముతో చానక్ ప్రవేసించెను. ఈప్రదేశము బ్రిటిషువారిదగుటచే, లాయడ్‌జార్జిగారి ప్రాణములు పైకెగసిపోయెను. ఎందుకు? ఒక సేనాధిపతియును, జాతీయవీరుడును సర్వత్రవిజయుడును, టర్కీదేశ నియంతయును అగు ముస్తఫా కెమాల్ పాషాయొక్క యుద్ధచాతుర్యమునకు! లాయడ్ జార్జిగారు "చానక్" పట్టణమునకు పోవలదని, టర్కీసేనలకు పెక్కు తంతివార్తలు పంపి, అనేకవిధముల భయపెట్టసాగెను. కాని తమజాతీయోద్ధారకుడగు కెమాల్‌వీరుని బొందిలో ప్రాణము ఉన్నంతకాలము, టర్కీసేనలు లాయడుజార్జిగారి తంత్రములకు లోబడి, భయపడుట కలలోనివార్తయాయెను. అందుచే మంత్రిగారి మంత్రాంగములు సాగునట్లు కనబడలేదు.

ఫ్రెంచి, యిటలీ మున్నగువారు ప్రపంచశాంతికొరకు తాత్కాలికసంధిప్రయత్నములు మొదలుపెట్టిరి. బ్రిటిషువారుకూడ వారి యుద్ధప్రయత్నములు మానివేసి ఇందులో కలిసిరి. ఈతాత్కాలికసంధి "ముడేనియా"లో జరుగెను. ఆసభకు అంగోరాప్రభుత్వము (కెమాల్ ప్రభుత్వము) తరపున ఇస్మెట్ పాషాగారును, బ్రిటిష్ వారి తరపున హారింగ్టన్ గారును వచ్చిరి. సభలో కెమాల్ పాషా కోరిన షరతులన్నిటిని ఒప్పుకొనిరి. సభ జయప్రదముగా జరిగెను. "ముడేనియా" సభ జరిగినవెంటనే కెమాల్ తనసైన్యములను చానక్ లోనికి ప్రవేశింపవద్దని అనుజ్ఞనిచ్చెను. ముడేనియాలో సభ జరుగుచున్న సమయములో కమాల్ పాషా అంగోరాకు వచ్చెను. వెంటనే టర్కీప్రజలు, ఎదురువెళ్ళి వారికి అఖండస్వాగతమిచ్చిరి.

ఇంతవరకును దేశములో రెండుప్రభుత్వములు అమలునందున్నవి. ప్రాచీనప్రభుత్వమగు సుల్తానుప్రభుత్వము కాన్ స్టాంటినోపిల్ లో నామమాత్రముగ నుండెను. కెమాలిస్టుప్రభుత్వము అంగోరాలో నుండెను. దేశములో ఇట్లు రెండు ప్రభుత్వము లుండుట దేశమున కనర్థదాయకమని కెమాల్ పాషా గ్రహించి కొంతకాలమునకు సుల్తానును లోబరచుకొని ఏకచ్ఛత్రాధిపత్యముగా పాలింపసాగెను. కెమాల్ పాషా సంవత్సరముల తరబడిని దేనికోసము నానాశ్రమల కోర్చి అనేక యుద్ధముల చేసి విశ్వప్రయత్నము చేసెనో, అట్టిస్వాతంత్ర్యము లభించగానే కార్యభారము తగ్గిపోయినదని, ఊరకొనక దేశములో అనేకమగుమార్పులు తీసుకొనివచ్చెను. కెమాల్ రాజ్యానికి వచ్చునప్పటికి దేశములో ఆకలిమంటలు, తీవ్రముగా విజృంభించుచున్నను ప్రజలు మూఢమైన పూర్వాచారములకు, బానిసలై కాలానుగుణ్యముగ మారుటకు యిష్టపడకుండిరి.

అయినను నిరుత్సాహ మిసుమంతయు లేక, దేశాభివృద్ధికరములగు సంస్కరణములకు నడుముగట్టెను మన కథానాయకుడు కెమాల్ పాషా.

దేశమున ముందు అజ్ఞానమును బోగొట్టి తద్వారా ప్రజలను విజ్ఞానవంతులనుచేయుటయే ప్రథమకర్తవ్యమని తలంచి అందుకు తగిన మార్పు లనేకములు నిత్యజీవనమందు కల్పించెను.

ఈ విధముగానే దేశములో పరిశ్రమలుకూడ ఎక్కువ అభివృద్ధి యగుటకు, ముఖ్యమైన కర్మాగారములను, పెట్టుబడిదారుల ఆధీనములో లేకుండ ప్రభుత్వమువారి ఆధీనముచేసి, ప్రజలకు పరిశ్రమలయందు అభిలాష కలుగునట్లు చేయగలిగెను.

టర్కీదేశములోని ప్రజలు మహమ్మదీయులగుటచే అచ్చట మత సంబంధమగు పట్టుదల చాలఎక్కువగా నుండినది. అట్టి మతపు పిచ్చిలో మునిగి, పూర్వాచారములకు గురియైన టర్కీ నేడు కెమాల్ పాషా అధ్యక్షతక్రింద మతవిషయములో గొప్పవిప్లవమును పొందినది. స్త్రీలకు ఘోషాపద్ధతి లేకుండజేసి, స్త్రీపురుషులకు సమానమగు హక్కులను ప్రకటించి, స్త్రీస్వాతంత్ర్యములను కాపాడెను.

విద్యావిషయములో నూతన విధానములను ప్రవేశపెట్టి, చాల చోట్ల ఉచితవిద్యాశాలలను నిర్మించి, విద్యావిధానములలో గొప్ప మార్పు కలిగించెను.

ఈ విధముగ అన్నివిషయములలోను గొప్ప విప్లవమును తీసి కొని వచ్చెను. టర్కీలో వచ్చినన్ని మార్పులు యీయిరువదవ శతాబ్దమున మఱియేదేశమందును (రష్యాతప్ప) వచ్చియుండలేదు. ప్రపంచ మున యెచ్చటను కెమాల్ వంటి ధీరుడు కానవచ్చుటలేదు.

ఇంతటి విప్లవము వచ్చినను, స్త్రీపురుషులు, ధనస్వాములు,

సామాన్యులు సమానముగా చూడబడుచున్నను, ఆ దేశం సామ్యవాద సిద్ధాంతములమీద మాత్రము పరిపాలింపబడు చుండుటలేదు.

నేడు తురుష్క ప్రపంచములో కెమాల్ పాషా మాటకు తిరుగు లేదు. ఇటువంటి ధీరుడు, వీరుడు అయిన ముస్తఫా కెమాల్ పాషా ప్రపంచవీరుడని చెప్పుటలో సంశయ మనవసరం.

---

## సన్ యత్ సేను

చీనాదేశమన్నను, చీనావారన్నను ఇతరులకు పరిహాసముగా నుండును. అట్టిపరిహాసాస్పదమగు దేశములో ప్రపంచవిఖ్యాతపురుషుడు డాక్టర్ సన్ యత్ సేన్. ఇటువంటిమహాపురుషులు ఇంకా ఎందరున్నారోగదా. లెనిన్ చే స్థాపింపబడి నేడు స్టాలిన్ చే నిరాఘాటముగా పరిపాలింపబడుచున్న సోవియట్ రష్యాపద్ధతులనే తనదేశములో కూడ వ్యాపింపజేసి అట్టి ప్రభుత్వమునే స్థాపించు కుతూహలముతో శాంతిసౌఖ్యము లనుమాట మఱచి, నిద్రాహారములను వదలి ఉరికంబము నీడనుకూడ నిలిచి కమ్యూనిజమును బోధించి, చివరకు తన యత్నములు సఫలముగాకమునుపే మరణించినవాడు డాక్టర్ సన్ యత్ సేను.

సన్ యత్ సేను ౧౮౬౬ లో క్యాన్ టంగ్ పట్టణముకు ३० మైళ్లదూరములోనున్న చాయహంగ్ అను పట్టణమున నొక బీదకుటుంబమున జన్మించెను. ఈతనితండ్రి క్రిస్టియన్ మతములో కలసి లండన్ మిషనరీ ఏజంటుగా తన సంసారమును గడుపుచుండెడివాడు. 'సన్' అనేది అతని కుటుంబ నామము. "యత్ సేను" అన భగద్భక్తుడ

అర్థమగుటచే అతనికి సన్ యత్ సేననినామము మిషనరీవారు పెట్టిరి. అసలు యతనిపేరు సన్ వెన్.

సన్ యత్ సేనును ఒకమిషనరీయైన ఆంగ్ల యువతి చాల ప్రేమించి, ఇతనికి ఆంగ్లభాషను చక్కగా నేర్పెను. ఇతడు ప్రతిరోజు తన తండ్రితో చర్చికి వెళ్లుటచే, అక్కడివారందరు ఈతనిని ప్రేమించి, ఈతనికి అనేకకథలు చెప్పుచుండెడివారు. మధ్యమధ్య ఇతని దేశచరిత్రను గురించియు, ఇతరదేశములను గుర్చించియుగూడ జెప్పుచుండెడివారు. అవన్నియు ఆబాలు డర్థముచేసికొని, ఎప్పుడును ఏదో ఆలోచించుచునే యుండెడివాడు. క్రమముగా సన్ యత్ సేను తమ దేశమును పరదేశస్థులు పాలించుట, ప్రజలను బాధించుట చూచుటతోడనే పరదేశస్థులపై సన్ యత్ సేనుకు ఐక విధమైన ఆవేశము ఆవేదన కలిగినవి.

పదిహేను సంవత్సరములురాగానే ఇంగ్లీషుభాష నేర్పించుటకై సన్ యత్ సేనును హవాయిద్వీపములోనున్న హానోలూలూకు పంపించినాడు. అచ్చటనే సన్ యత్ సేనుగూడ క్రైస్తవమతము స్వీకరించాడు. చదువుముగించి స్వదేశమునకు మరలెను. తిరిగివచ్చుచుండగా ప్రభుత్వోద్యోగులు ఈతనినిచాల నీచముగా చూచుటచే ఈతనిలో కొంత భావోద్రేకము బయలుదేరి, పరప్రభుత్వమైన మంచూ ప్రభుత్వమును ఎటులైన పడగొట్ట ప్రయత్నించినాడు.

సన్ యత్ సేను ౧౮వ సంవత్సరముననే హాంకాంగ్ లో నున్న డాక్టరు జేమ్సుకాంట్లీగారి వైద్యకళాశాలలో ౫ ఏండ్లు వైద్యవిద్య నభ్యసించి వైద్యవృత్తిలో గొప్పపేరునొందెను. వైద్య కళాశాలలోని ప్రొఫెసర్లు అందరును ఈతని తెలివితేటలకు ఆశ్చర్యపడుచుండిరి.

అచట వైద్యవిద్య పూర్తిజేసుకొని, పోర్చుగీసుకాలనీలో ప్రాక్టీసు పెట్టవలనని సంకల్పించుకొని, అచటికి వెళ్లుసరికి పోర్చుగీసు వైద్యులు,

చీనావారెవరును అచ్చట ప్రాక్టీసుచేయకూడదని నిషేధించిరి. అందుచే కాంటన్ నగరములో ప్రాక్టీసుపెట్టి అఖండముగా ధనసంపాదన చేయసాగెను. ఈ వైద్యవృత్తిచేత సన్ యత్ సేను ప్రజలలో గొప్ప పలుకుబడి ప్రజల అభిమానమును సంపాదించ గల్గెను. సన్ యత్ సేను వైద్యవృత్తిలో నున్నప్పుడే దేశపర్యటనము జేసి. అద్భుతమైన వైద్య విజ్ఞానమును సంపాదించెను. ఆసమయములోనే చీనా దేశములో "చీనాయువజన సంఘము" (Young China Party) స్థాపించి చాలమంది యువకులను సభ్యులుగా జేర్చెను.

మరియొకమారు దేశ సంచారము చేయుచుండి "హానలూలు" చేరుసరికి, చీనాజపానుయుద్ధము తటస్థించినది. ఆయుద్ధములో చీనా కొన్ని ప్రదేశములను ఓడిపోవుటయేగాక, నీచమైన సంధినికూడా చేసికొనవలసి వచ్చినది. ఈ సంధివల్ల ప్రజలలో అసంతృప్తిఅధికముగ చెలరేగినది.

దేశములో దారిద్ర్యము, నిరుద్యోగము, ఆకలిబాధ హెచ్చుగా నున్నవి. మంచూప్రభుత్వము ౧౬౪౪ నుంచి పరిపాలించుచున్నప్పటికి దేశములో అభివృద్ధి ఏమియుకూడ కనుబడుటలేదు. మంచూచక్రవర్తుల పరిపాలనము నిరంకుశముగా నుండెను. దీనిని ప్రతిఘటించుటకు డాక్టరు సన్ యత్ సేను తన దేశసంచారములో "వ్యఙ్-చంగ్ మూయి" అనే సంఘమును స్థాపించి, దేశీయులను ఆసంఘమున చేర్పించుటకు మొదలుపెట్టెను. ఈవిధముగా డాక్టరు సన్ జపానుగూడ పర్యటనముజేసి అక్కడనున్న చీనావారినిగూడ తానుస్థాపించిన సంఘములో చేర్పించెను. ఇట్లు పర్యటన మొనర్చుచున్న సమయమునగూడ నితడు విప్లవప్రయత్నములను చేయుచునేయుండెను. దేశపరిస్థితులను జూచి, డాక్టరుసన్ విప్లవపరిస్థితులు వచ్చినవని తెలిసికొని, తన అమెరికా సంచారము మానివేసెను,

చీనాలో ఒక ధనవంతుని సహాయముచే "సన్ అండ్ కంపెనీ" అనునొక వర్తకసంఘమును స్థాపించి దానిద్వారా విప్లవోద్యమమును సాగించెను. ఒకసారి ఈ కంపెనీకి వచ్చు బేళ్లను ప్రభుత్వమువారు అనుమానముతో విప్పిచూడగా ఆ బేళ్లలో కొన్నివందలతుపాకీ లుండె నట. ఆకారణముచే ప్రభుత్వము పెక్కుమంది స్వరాజ్యవాదులను అరెస్టుచేసి అందుకొందరిని ఉరికూడదీసెనట. నాయకుడగు సన్ యత్ సేనుమాత్రము ఒక కూలవాని బుట్టలో దాగుకొని మారువేషముతో జపానుకు పారిపోయెను. ప్రభుత్వమునకు ఈ సంగతి తెల్లియనికారణముచే చీనాదేశమంతయూ వెదకి చివరకు ప్రయత్నము నిష్ఫలము కాగా ఇతనినిపట్టి తెచ్చినవారికి, గొప్ప బహుమాన మిచ్చెదమని ప్రకటించిరి. కాని లాభములేకపోయెను. జపానులోకూడ క్లిష్టపరిస్థితు లేర్పడుటచే, సన్ యత్ సేను అచ్చటినుండి అమెరికాకు పారిపోవలసివచ్చెను. దారిలో పాతస్నేహితుడు డాక్టరు జేమ్సుకాంట్లీ కనబడి ఇంగ్లాండు రావలసినదని పట్టుబట్టినను ఇతడు అమెరికాకే వెళ్లెను. అచ్చట సన్ యత్ సేను చీనావారందరిని ప్రోగుజేసి అక్కడకూడ కొన్ని విప్లవసంఘముల నేర్పరచి ఆసంఘములద్వారా కొంతధనమును ప్రోగుజేసి ఇంగ్లాండువెళ్లి జేమ్సుకాంట్లీని కలిసికొనెను. అంతలో ఇతనిని వెంటాడుచున్న సి, ఐ, డీ. లు ఇతనిని బంధించి చీనా రాయబారి గృహములో దాచి మరునాడు చీనాకుబంపు ప్రయత్నములు చేయుచుండిరి. ఈసంగతి ఎవరికినిగూడా తెలియనీయలేదు. ఆరోజు ౧౮౯౬ సం॥ ౧౭వ తేది, శనివారము. మరునాడు ఆదివారమగుటచే కోర్టులు, ఓడలు మొదలైనవి యుండవు. తెల్లవారినచో డాక్టరు సన్‌ను ప్రత్యేకముగ నావమీద తీసుకొనిపోవుదురు. గత్యంతరము లేక సన్ యత్ సేను తనవద్దనున్న పెన్సిలుతో ఒకఉత్తరమును వ్రాసి తన మిత్రునకు యిమ్మని అచ్చటనున్న నౌకరున కీయగా

ఆయుత్తరమును ఆనౌకరు చీనా ప్రధానికే యిచ్చుటవల్ల యీతని స్థితి మరింత విషమమయ్యెను. వెంటనే ప్రభుత్వముడాక్టరు సన్ వద్దనున్న పెనిసిలుసు, కాగితమునుగూడ లాగికొనిరి.

సన్‌యత్ సేనువద్ద ఒక విచిత్రమైన కోటున్నది.ఆ కోటు నిండ జేబులే! ఆజేబులన్నియు ఎప్పుడును కాగితములతోనే నిండియుండును. ప్రభుత్వమువారు ఆజేబులన్నియు వెదికి కాగితముల నన్నిటిని లాగుకొనిరి. సన్‌యత్‌సేను అదృష్టవశాత్తు వారికి రెండుజేబులు కనబడకపోవుటచే సన్ మఱియొక కాగితమును దీసి తిరిగ ఆ యుత్తరమును వ్రాసి మరియొక నమ్మకమైన నౌకరున కిచ్చెను.

నౌకరు తనభార్యయైన "కోల్"తో ఈసంగతిచెప్పి ఉత్తరమిచ్చెను. ఆమె ఆ యుత్తరమును చదువుకొని వెంటనే ఆతురతతో డాక్టరు కాంట్లీ ఇంటికి వెళ్ళి ఆయనను నిదురనుండిలేపి ఆయుత్తరమునిచ్చి స్వగృహమునకు వెళ్ళిపోయెను. ఆయుత్తరముఆయనకు చేరునప్పటికి రాత్రి ౧౧ గంటలైనది.

ఆయుత్తరములోని సంగతులివి:—"నేను యిద్దరి చీనావారిచే బంధింపబడి చీనారాయబారి గృహములో నుంచబడితిని. ఒకటి రెండుదినములలో నన్ను ప్రత్యేకమగు నావపై చీనాకు తీసికొని పోయెదరు. అచ్చట నన్ను ఉరితీయుట నిశ్చయము"—సన్ యత్ సేను.

ఈ సంగతులు డాక్టరు కాంట్లీ చదువుకొనుసరికి తెల్లబోయినాడు—అర్ధరాత్రి—ఆతురతగానున్నది—ఏమియు తోచుటలేదు. వెంటనే కాంట్లీయు, అతని స్నేహితుడైన డాక్టరు మాన్‌సెన్‌సున్నూ, స్కాట్లండు యార్డు పోలీసు శాఖకు రిపోర్టుచేయగా ఏమియు లాభములేకపోయినది. పిమ్మట డౌనింగ్ స్ట్రీటులోనున్న మంత్రులతో కాంట్లీ మాన్‌సెన్‌లు పూర్తి సంగతులన్నియుచెప్పి, బ్రిటీషు హద్దులలో

నున్న మనిషిని ఆరెస్టుచేయుటకు ఇతర ప్రభుత్వమువారికి హక్కు లేదనియు కావున విడిపింప వలయుననియు చెప్పిరి. కాని అక్కడ కూడ లాభములేకపోయెను. ఆరాత్రికిరాత్రి వెంటనే కాంట్లీ మేన్సన్ పత్రికా సంపాదకులతోడను, తదితరముఖ్యులతోడను ఈ విషయ మంతయు చెప్పిరి. మరుసటిరోజున పత్రికలలో "సన్ యత్ సేనును" అక్రమముగా అరెస్టుచేసిరనియు, వెంటనే మంత్రులు తది తరులుకూడ వాని విడుదలకు ప్రయత్నించవలెననియు ప్రకటించిరి. అంతటితో దేశములో అల్లరి బయలుదేరినది. కొంతమంది స్వతంత్ర వాదులు చీనారాయబారిగృహమును ముట్టడించిరి. ఆరాయబారికి హడలెత్తినది. అంతలో బ్రిటిషు ప్రభుత్వవిదేశ శాఖామంత్రి సాలిస్ బరీకూడ స్వతంత్రవాదుల నాయకుడైన సన్ యత్ సేనును విడువవలయు నని చీనారాయబారికి వ్రాసెను. ఆ రాయబారి ఈ ప్రజాందోళ నమువలన బాధపడలేక డాక్టరు సన్ యత్ సేనును విడిచెను.

సన్ యత్ సేను విడుదలైనవెంటనే ప్రచారము నిమిత్తము ఐరోపాఖండమును, మరియు టర్కీ, మలయా, సయామ్, జపాను దేశములను సంచారముజేసి తన కార్యక్రమమైన సూత్రత్రయమును ప్రజలలో బోధించెను,

## సూత్రత్రయము

(1) చీనా స్వతంత్రముగా నుండవలెనన్న, జాతీయతను పెంపొందించుకొని ఇతరదేశముల సహకారముతో తనదేశమును తానే పరిపాలించుకొనవలెనుగాని విదేశస్థులకు ఏమాత్రమును తావీయ కూడదు.

(2) ప్రజాస్వామిక పరిపాలన స్థాపించవలెను.

(3) చీనా ప్రజ లందరికి తినుటకు తిండి, కట్టుటకు బట్ట, ఉండు

టకు ఇల్లుండి దేశసౌభాగ్యమంతయు అందరికి సమానముగా నుండ వలెను.

ఈ మూడు ధర్మసూత్రములపై సన్ యత్ సేను తనకార్యక్రమము నాధారపఱచెను. స్వతంత్ర భావపూరితుడైన డాక్టరు సన్ యత్ సేను చీనా ప్రభుత్వపరిపాలనలో మార్పులు చేసినంత మాత్రమున సంతసించుటలేదు. ఇతని యుద్దేశములో పూర్తిగా విప్లవము వచ్చినగాని దేశములో తన సూత్రత్రయము అమలులోకి రాదని ఇతని గాఢనమ్మకము.

సన్ యత్ సేను ౧౯౯౫ లో ప్రవాసశిక్ష ననుభవించునప్పుడు లెనిన్ మొదలైన రష్యానాయకులతో సంప్రదించి చీనాజాతీయోద్యమమును గురించి చర్చించెను. ౧౯౨౧ లో లెనిన్ కార్యదర్శితోకూడ డాక్టరు సన్ మాట్లాడి చీనాభావికార్యక్రమమును నిర్ణయించెను.

సన్ యత్ సేను బక్సారుయుద్ధసమయములలో మందుల నమ్ము వాడి వేషము వేసుకొని మందుగుండు సామాను గొనుటకు, హాంకాంగు వెళ్లి తిరిగి వచ్చునప్పుడు ప్రభుత్వోద్యోగులచే పట్టుబడి హాంకాంగు ద్వీపములో నుంచబడెను.

తరువాత ౧౯౦౪ లో సన్ యత్ సేను టోకియోలో అఖిలచీనా స్వాతంత్ర్యమహాసభ నేర్పరచి ఆమహాసభాధ్యక్షపీఠమును అలంక రించెను. ఆ సభాఫలితముగా అనేకులు సన్ యత్ సేను ధైర్యసాహసములకు మెచ్చుకొని ఇతడు ఏర్పరచిన విప్లసంఘములో సభ్యులుగా జేరిరి. సన్ యత్ సేను విప్లవజయము కొరకు దేశదేశములు తిరిగి లక్షలకు లక్షలు ధనమును ప్రోగుచేయుచుండెడివాడు. కాని ఆ డబ్బులో నొక్కపైసగూడ స్వార్థమున కుపయోగించుకొనక, ఎప్పుడును నిరాడంబరముగనే నుండెడివాడు.

పిమ్మట ప్రతిరాష్ట్రములోను విప్లవము నిమిత్తము తీవ్రకృషి చేయుచుండెడివాడు. కాని ప్రభుత్వము కడుజాగ్రత్తతో విప్లవమును అణచివేయుచుండెడిది. ఈ విధముగా సన్ యత్ సేను ప్రతిచోట విప్లవప్రయత్నములు చేయుచు, ఓడిపోయిన చోటనుండి మరియొక చోటునకు వెళ్లుచుండెడివాడు. ఈ విప్లవసందర్భములో అనేకులను ప్రభుత్వము అరెస్టుచేసి ఉరికూడ తీయుచుండెడిది. ఇంత రాక్షసత్వము, కాఠిన్యము వహించిన ప్రభుత్వమునుండి సన్ యత్ సేను తల దాచుకొనుటకైన తావు దొరకుట దుర్లభమాయెను. ఆశియాఖండములో ఎచ్చటకూడ తావు దొరకకపోవుటచే ఇతడు అమెరికా చేరుకొనెను.

చీనాదేశములో ఉరిశిక్షలు, అరెస్టులు, శిరచ్ఛేదములు లెక్కకు మీరిపోయినవి. అక్రమము హెచ్చుపెరిగి ప్రజలలో హత్యలు ప్రారంభమయ్యెను. ప్రభుత్వపరిపాలన నానా బీభత్సముగానుండెను. ఒకమూల చీనాప్రజలు ప్రజాస్వామ్యపరిపాలన కావలెనని మొరపెట్టుచుండఁ ప్రభుత్వపరిపాలన మరింత నిరంకుశత్వము దాల్చి ప్రజాందోళనను అణచివేయుటకు ప్రయత్నించుచుండెను. ఇట్టి సమయమున సన్ యత్ సేను అనుచరులు పెక్కులు ప్రభుత్వముచే అరెస్టుకాబడి ఉరితీయబడిరి. దీనికితోడు ౧౯౧౧ లో ఒక యింటిలో బాంబు ప్రేలినది. ఆసాకుతో ప్రభుత్వము మరికొంతమందిని చంపివేసినది. ఈ కారణములచే ౧౯౧౧ అక్టోబరు ౨౯ వ తేదీని చనిపోయినవారియందు, సానుభూతి చూపుచు స్వతంత్రవాదులు ప్రభుత్వముపై నెదురుతిరిగి వారి విప్లవజ్వాలలను ప్రజ్వలింపజేసిరి. చీనా యువరాజు తరఫున పరిపాలించుచున్న రాజమాత ఈ విప్లవమును అణచివేయు నిమిత్తము చాల ప్రయత్నించినది. కాని లాభము లేకపోవుటచే సంధిషరతులు మాట్లాడినది. సంపూర్ణ స్వాతంత్ర్యవాదులును, ప్రజాస్వామ్యపరిపాల

నాకాంక్షితులును అగు ఈ విప్లవ వీరులు రాజీకి రాకపోవుటచే విసువు జెంది సింహాసనమును ఖాళీజేసి ప్రజాస్వామ్యపరిపాలన నెలకొల్పుకొనుమని వెడలిపోయెను.

వెంటనే క్యూమెన్‌టాంగ్ యాజమాన్యము క్రింద నాన్‌కింగులో తాత్కాలికరాజ్యము నేర్పాటుజేసి సన్‌యత్ సేనును చీనాప్రజాస్వామ్యపరిపాలనాధ్యక్షుడుగా నెన్నుకొనిరి. డాక్టరు సన్‌యత్‌సేను అప్పటికి లండనునందుండుటచే వెంటనే రావలసినదని తంతి వార్త నంపిరి. డాక్టరు సన్ లండన్‌నుంచి బయలుదేరి హాంకాంగులో దిగగానే అఖండమైన స్వాగతమిచ్చిరి. షాంఘైలో పదునెనిమిది రాష్ట్రముల ప్రతినిధులు కలిసి ఈయననే అధ్యక్షుడుగా నెన్నుకొనిరి. ౧౯౧౨ జనవరి ౧-వ తేదీ నూతనసంవత్సరమను కారణముచేత వివిధ రాష్ట్రములనుండి అనేకులు వచ్చి ఈయనకు స్వాగతములిచ్చిరి. ఈ ప్రభుత్వమువారు పదభ్రష్టుడైన మంచూ చక్రవర్తికి, ఆయన కుటుంబమునకు, సంవత్సరమునకు 40 లక్షల రూపాయ లిచ్చుటకేర్పాటు చేసిరి.

నిద్రలోనున్న దేశమును మేల్కొల్పి, స్వాతంత్ర్యబీజములను వెదజల్లి, ప్రజాస్వామ్యపరిపాలనను స్థాపించి, అధ్యక్షపీఠము నలంకరించిన డాక్టరు సన్‌యత్‌సేను చాలకాలము పరిపాలించక కొన్ని కారణాంతరములచే తన అధ్యక్షపదవికి రాజీనామా నిచ్చి ౧౯౧౩ లో జపానుకు వెళ్లి రెండేండ్లు అచ్చట నివసించెను.

సన్‌యత్‌సేను తన అధ్యక్షపదవికి రాజీనామ నీయగనే "యయన్‌షికాయి" అనునతడు అధ్యక్షుడయ్యెను. ఈయన పరిపాలనలో జాతీయభావము నశింపజొచ్చెను. విదేశీయులుకూడ ప్రభుత్వములో జోక్యము కలుగజేసికొనిరి. ఈయనపరిపాలన ప్రజలను

సంతృప్తిపరచలేదు. దానికి సన్ యత్ సేను జపానులోనుండి కూడ చాల విచారించెడివాడు. అయినప్పటికి ఆ నేకులతో ఉత్తరప్రత్యుత్తరములు జరిపి మంచిమంచి సలహాల నిచ్చుచుండెడివాడు. "యయన్షికాయి" అధిపత్యమునను న్న చీనాను చూచి సన్ యత్ సేన్ పరితపించెడివాడు.

౧౯౧౫ లో అనగా సన్ యత్ సేను జపానులోనుండు సమయమున నే షాంగ్ హేలో నున్న సుప్రసిద్ధ వర్తకుడైన సూంగ్ కుమార్తెయగు "చింగ్ లింగ్" అను నామెను వివాహమాడెను. సన్ యత్ సేను వివాహమైనవెంటనే తిరిగి చీనావచ్చి ప్రజ లందరి సహాయముచే, తిరిగి విప్లవము లేవదీసి, "యయన్ షికాయి" ప్రభుత్వమును ఎదుర్కొని దిగ్విజయమొంది, దక్షిణ చీనాలోమాత్రము గొప్ప ఆదర్శమైన ప్రజాస్వామ్య పరిపాలనమును స్థాపించగలైను. ఉత్తర చీనాలోమాత్రము "వియాన్ హంగ్" అధ్యక్షు డాయెను. ౧౯౨౨ లో మంచూరియా రాష్ట్రాధిపతి పీకింగుప్రభుత్వముపైన దండెత్తి ప్రభుత్వమును వశపరచుకొనెను. ఆ సమయమున సన్ యిత్ సేను తననద్దనున్న సైన్యమును మంచూరియారాజుపై యుద్ధముచేయుమని ఆజ్ఞాపించగా ఆసైన్యాధిపతి నిరాకరించి, సన్ యత్ సేనును నెదుర్కొనెను. అంతటితో సన్ యత్ సేనుమాట వినువారెవరు లేకపోవుటచే ఒకనావలో పారిపోవలసి వచ్చెను. కాని ఆ నావలోకూడ ప్రతికక్షులు వానిని పట్టుకొనగా, వారిని తన గంభీరోపన్యాసమువల్ల ఆశ్చర్యచకితులనుచేసి భార్యతో కూడ షాంగ్ హే చేరుకొనెను.

ప్రపంచవిఖ్యాతి గాంచిన సన్ యత్ సేను తుచ్ఛసౌఖ్యముల కొరకు ఆశించక, దేశదాస్య విముక్తియే తనపరమావధియని యెంచి, నిద్రాహారములు గూడ మాని, శాంతిసౌఖ్యములను మరచి, నిదురలో

నున్న దేశమును మేల్కొల్పి, జాతీయభావము నంకురింపజేసి, ౧౯౨౫ లో వీరస్వర్గము నలంకరించెను.

ప్రపంచవీరుడైన సన్‌యత్‌సేను చనిపోవునపుడు రష్యాదేశమునకు ఒక లేఖను వ్రాసెను. దానియందిట్లున్నది :—

“లెనిన్ మీదేశమునకు విప్లవమును సందేశము నిచ్చి జాత్యుద్ధరణకు పూనుకొని విజయమందెను. మీ దేశము మొందట లెనిన్‌ను ఏ విధముగా కలవరపెట్టినదో, చీనాదేశము ఇప్పుడు నన్నావిధముగా కలవరపెట్టుచున్నది. చీనాలోని నాపక్షమువారుకూడ విప్లవవాదులే కావున మాదేశముగూడ మీదేశమువలె సామ్యవాదము నెప్పుడు స్వీకరించునా అని ఆలోచించుచున్నాము. మీదేశము మాకుచేసిన మేలును మరచిపోజాలము.”

ఇట్టి ఆదర్శపురుషుడును, గొప్పవీరుడును, పరరాజ్యపీడనతో క్రుంగిపోవుచున్న చీనాకు స్వాతంత్ర్యతృష్ణ కలిగించిన మహాపురుషుడును ఆధునికచీనా నిర్మాతయును నగు డాక్టర్ సన్‌యత్‌సేను నలబది యెనిమిదికోట్ల చీనాప్రజలకేగాక దేశాంతరులకుగూడ పూజనీయుడయ్యెను.

# మాజరిక్.



ప్రెసిడెంటు మాజరిక్ మహాత్ములలో మహాత్ముడుగను, పండితులలో పండితుడుగను, విప్లవకారులలో విప్లవకారుడుగను, స్వాతంత్ర్య వీరులలో గొప్పస్వాతంత్ర్య వీరుడుగను, వేదాంతులలో మహా వేదాంత శాస్త్రపారంగతుడుగను, రాజకీయవేత్తలలో గొప్ప రాజకీయవేత్తగను, త్యాగమూర్తులలో గొప్ప త్యాగమూర్తిగనుకూడ నుండుటచేత "రాజర్షి" యని బిరుదము గాంచగలిగెను.

తమ రాజ్యములను స్వతంత్రములుగా చేయవలెననిన, రక్తపాతముతోకూడిన విప్లవముచేతనే తప్ప, మరొకవిధముగా, వీలులేదని ఎల్లరు తలంచు రోజులలో, నేడు గాంధిమహాత్ముడు యెటుల భారతదేశమునందు అహింసా సిద్ధాంతముమీద ప్రజలకు స్వాతంత్ర పిపాస కలుగజేసి, స్వాతంత్రమును సాధింప బూనుకొనగలిగెనో, అరీతిగనే ప్రెసిడెంటు రాజర్షి మాజరిక్ తనదేశమును, రక్తపాతముతోకూడిన విప్లవ మేమియును జరుగకుండగనే దాస్యవిముక్తి జేసి స్వాతంత్ర్యముగ జేయగలిగెను.

మాజరిక్ ౧౮౫౦ సం॥లో మొరావియన్ సామ్రాజ్యములోని "జెకొస్లావేకియా"లో యొకగర్భ దరిద్రునిఇంటిలో జన్మించెను. మాజరిక్ తండ్రి గుఱ్ఱపుబండితోలువాడు. తల్లి వంటలక్క. ఇట్లు తమ జీవనమును గడుపుచుండెడివారు. మాజరిక్ అసలు పేరు థామాస్ మాజరిక్. మాజరిక్ యింత గర్భదరిద్రకుటుంబములో పుట్టుటవలన మాక్సిమ్‌గోర్కీవలె బాల్యావస్థలోనే అనేక కష్టములను ఎదుర్కొనవలసి వచ్చెను. మాజరిక్ బాల్యముననే యింత దారిద్ర్యావస్థలో నుండుటచేత ధనవంతులు చేయుచున్న దుండగ

ములను, దుర్వ్యయమును, దుర్వ్యాపారములను, అధికారదుర్వినియోగములను చూచి సహించలేక వారి దుండగములకు తగిన ప్రాయశ్చిత్తము చేయవలెనని తలంచుచుండెడివాడు.

నిజముగా పుత్రులయొక్క తెలివితేటలకు, వారి ప్రపంచ ఖ్యాతికి వారితల్లులే కారణమని చెప్పవలసియున్నది. ఛత్రపతి శివాజీకి వానితల్లి బాల్యముననే వీర్య, శౌర్య, ప్రతాప విజ్ఞానములను ఏవిధముగ నేర్పినదో ఆవిధముగనే మాజరిక్‌నకు వానియొక్క తల్లి ఉగ్రపాలతో వలయు సుగుణము లన్నియు నేర్పినది. కుటుంబము కటిక దరిద్రములో కొట్టుకొనుచున్నను ఉన్న ఒక్కకొడుకైనను విద్యావంతుడు కావలెనని యితని తల్లి యెంతయో కుతూహలపడెడిది. కాని తండ్రి దూరదృష్టిలేనివాడగుటచే మాజరిక్‌ను చదివించుటకు నంగీకరించలేదు. మాజరిక్ తల్లి ఆతనికి చిన్నప్పటి నుండియు గొప్పగొప్పవారి చరిత్రలనుగురించి చెప్పుచు, స్వగ్రామములో నున్నచదువులు పూర్తిచేయించ గలిగెను. పిమ్మట 'హాస్టోపెక్' అను గ్రామమునందు కొందరి ప్రాపకమువలన మాజరిక్ లోవరు సెకండరీ పూర్తిచేసెను. నిరుపేదకుటుంబములో పుట్టిన మాజరిక్ యింకచదువుటకు శక్తిలేక, తనచదువునకు స్వస్తిచెప్పి, యొక కమ్మరి దుకాణములో పని నేర్చుకొనుటకు ప్రవేశించెను.

భావి భాగ్యవిధాతలకు చిన్నతనముననే అనేక కష్టములు కలుగుచుండుటయు; తిండికిగూడ యేమియులేక వారు మలమలమాడుచుండుటయు; తుదకు వారు దేశనాయకత్వమును, సర్వాధికారమును వహించుటయు మనము సాధారణముగా జూచుచునే యున్నాము. నేటిరష్యానియంత స్టాలిన్, మాజరిక్‌వలెనే కటిక పేదరిక మనుభవించి, తనలోనున్న విప్లవ శక్తులచే ఈరోజున భూలోకస్వర్గ మనిపించు రష్యాదేశమునకు నియంతగా ఏర్పడెను. మతగ్రంథము లమ్ము

కొని జీవించు నొక ఏజంటుయొక్క కొడుకు! డాక్టరు సన్‌యత్ సేన్ చర్చిలోనివారి అభిమానముచే విద్యనభ్యసించి చీనా భాగ్యవిధాత యయ్యెను. తురుష్క జాతీయోద్ధారకుడగు ముస్తఫా కెమాల్ పాషా కూడ యొక బీదకుటుంబమున జన్మించి నేడు టర్కీ దేశమును నిరాఘాటముగా పాలించుచుండెను. అటులనే మాజరిక్ కూడా ఒక బీదకుటుంబములో పుట్టి కొద్దివిద్యమాత్రమే అభ్యసించి, కమ్మరి దుకాణములో ప్రవేశించినతర్వాత, కొలది కాలమునకు తిరిగి మంచి వాసనలు గాన్పించుటచే కమ్మరిశాలలో మానివేసి 'బ్రినో' పట్టణము వెళ్లి, అచ్చటవిద్యను పూర్తిగావించుకొని ౧౮౭౨ సం॥లో వియన్నాలో మెట్రిక్యులేషన్ నందు ఉత్తీర్ణుడై విశ్వవిద్యాలయమునందు చేరెను. చివరకు యెన్నియో కష్టములతో కట్టుకొనుటకు బట్ట లేక చిరిగిన వస్త్రములతో, విశ్వవిద్యాలయములో పట్టభద్రుడై చదువును ముగించెను. అంతటితో మాజరిక్ యొక్క దారిద్ర్యపూర్ణమైన విద్యార్థిదశ దాటినది.

పిమ్మట జర్మనీలోని "లీప్‌జిగ్" విశ్వవిద్యాలయములో ప్రొఫెసరుగాను కొన్నాళ్లు వియన్నాలో లెక్చరరుగా నుండెను. ఈవిధముగా ఆయన చదువుకొరకు వెళ్లి, యుద్యోగములు చేయుచు, వియన్నాలో మొత్తము ౧౦ ఏండ్లు ఉండెను. మాజరిక్ యిచ్చటనే 'మిస్ గారిగ్' యను అమెరికను స్త్రీని ప్రేమించి వివాహమాడెను. భార్యాభర్తలిద్దరు భిన్న దేశస్థులైనప్పటికిని చాల అనురాగముతోను, ప్రేమతోను సంతోషముగా నుండెడివారు. దీనికి ఉదాహరణముగా మాజరిక్ తనభార్యపైగల మోజు, ప్రేమ, అభిమానము కొలదిని తనపేరును "థామస్ గారిగ్ మాజరిక్" యని మార్చుకొనుటను పేర్కొనవచ్చును. ఆమెకూడ భర్తకు అన్నివిషయములలోను చేదోడు వాదోడుగా, నుండెననుటకు ఎట్టి సందియములేదు.

౧౮౮౨ సం॥లో అనగా వియన్నానుంచి వచ్చిన తరువాత 'జెకోస్లావేకియా' ముఖ్యపట్టణమైన ప్రేగ్‌లో అసిస్టెంటు ప్రొఫెసరుగా నుండెడివాడు. మాజరిక్ యింక కొలదిదినములలోనే ప్రొఫెసరుపదవిని స్వీకరించు ననగా కొందరు స్నేహితులు ఏమో కుట్ర పన్నుటవలనను, దానిలో మాజరిక్ కూడ చిక్కుకొని యుండుటవలనను ఆయుద్యోగ మూడినది.

ఇంత తెలివితేటలు గలవాడైనప్పటికిని, మాజరిక్‌న కప్పటికి తన మాతృభాష ''జెక్''లో ప్రవీణత లేకుండుటచేత దానిని నేర్చుకొనుటకు తీవ్రకృషిచేసి దానిలో అపారమైన పాండిత్యమును సంపాదించెను. ఒక్క మాతృభాషలోనే గాక మాజరిక్, గ్రీకు, లాటిన్, ఇంగ్లీషు, ఫ్రెంచి, రష్యన్, ఇటలీ, జర్మన్ భాషలనుకూడ త్వరలో నేర్చుకొని గొప్ప పండితుడాయెను. నేటినియంతలలో, మాజరిక్ వలె అన్ని భాషలు తెలిసియున్న వారెచ్చటనులేరు. మాజరిక్ ఇన్ని భాషలు నేర్చుటవల్ల ప్రపంచములోని కంతయు గొప్పరాజకీయవేత్తగాగలిగెను. రాజకీయములలో నీతని మేధ అత్యద్భుతమైనది.

మాజరిక్‌నకు ప్రేగ్‌లో నివశించుచున్నప్పుడే తనదేశమును దాస్య విముక్తిచేసి, తనజాతిని పూర్తిగా సంస్కరింపవలెనని బుద్ధిపుట్టినది.

మొరావియన్ సామ్రాజ్యములో, జెక్ అనే జాతివారు, స్లోవక్ యనేజాతివారును కలసియుండుటచే 'జెకోస్లోవేకియా' యని పేరు వచ్చినది. ఈ జెక్ స్లోవక్ జాతులవారు చాలకాలము క్రిందటనే విడిపోయి, బానిసత్వమునకు అలవాటుపడిపోవుటచే, ఆ మొరావిక్ సామ్రాజ్యమును ఆస్ట్రియా, హంగేరీ ప్రభుత్వములవారు స్వాధీనపరచుకొని వారిచ్చవచ్చినట్లు నిరంకుశముగా పరిపాలించుచుండిరి.

ప్రజలను లేనిపోని వంకలచే పీడించి ధనమును లాగుచుండిరి. మేడలో ఒకడు తూగుటుయ్యాలలో నూగుచు సర్వసౌఖ్య మనుభవించు చుండ, మరొకకొంపలో ఒక కుటుంబము ఆకలిబాధచే మలమలమాడి పోవుచుండెడిది. ఇటు లీవిధముగ ఆస్ట్రియా, హంగేరీ ప్రభుత్వముల క్రిందనున్న జకోస్లోవేకియాలో అశాంతి ప్రబలినది.

ఈ సమయములో మాజరిక్ మహాత్మునివలె దేశదారిద్ర్య విమోచనకై, స్వరాజ్యసంపాదనకై స్వాతంత్ర్యరంగమున కురికి జెక్, స్లావక్ జాతులవారి ఐకమత్యమునకై పాటుబడి ప్రజలందరికిని స్వాతంత్ర్యపిపాస గలుగజేసి చివరకు కృతకృత్యు డాయెను. కాని మాజరికు దేశస్వాతంత్రము రావలెనన్న ప్రజలలో పూర్తివిప్లవము రావలెనని గ్రహించి జెకోస్లావేకియా ప్రభుత్వమునకు వ్యతిరేకముగా ప్రచారము చేయసాగెను.

మాజరిక్ జెక్ జాతివాడైనప్పటికిని, జెక్ స్లోవక్ జాతులవారి ఐకమత్యమునకు తీవ్రకృషి చేసి "రియలిస్టు సంఘము" అను నొకదానిని స్థాపించి, చాలమందిని సభ్యులుగా జేర్పించెను. మాజరిక్ యొక్క అత్యద్భుత మేధాశక్తి, సత్యము మొదలైనవి యీసంఘముయొక్క నామధేయములోనే యిమిడియుండుటవలన మాజరిక్ గుణవిశేషములను యీ సంఘముపేరు, మరింత వెల్లడి చేయుచున్నది. ఈ సంఘములో జెక్స్ కు యెంత అధికారమున్నదో స్లోవక్స్ కుకూడ అంత అధికార ముండెను. మాజరిక్ యీ సంఘముద్వారా అనేక మగు పనులను చేయగలిగెను. మాజరిక్ అనేక రాజకీయ పుస్తకములను చదివి ప్రపంచ రాజకీయపరిస్థితులను అవగాహన చేసుకొని, ఆస్ట్రియా, హంగేరీ ప్రభుత్వముల గుట్టు తెలుసుకొనుచుండెను.

ఇటువంటి క్లిష్టపరిస్థితులలో ప్రపంచయుద్ధజ్వాలలు తీవ్రముగా

విజృంభించుచుండెను. తమదేశము సంపూర్ణస్వాతంత్ర్యము పొందుటకు ఇదేసమయమని గ్రహించి ఇతడు మరింత కృషిచేయ మొదలిడెను. ౧౯౧౪ లో ప్రపంచయుద్ధము ప్రారంభమైనది. ఆ సమయములో అమెరికాలో ఉన్న మాజరిక్ వెంటనే ప్రేగ్ వచ్చి తన ప్రజలను స్వాతంత్ర్యము పొందుటకు తగిన సమయము వచ్చినదని హెచ్చరించి తిరిగి విదేశములకు వెళ్లిపోయెను. అప్పుడు కనుక ప్రేగ లో మాజరిక్ యుండినట్లయిన, ప్రభుత్వమువారి తీవ్రశిక్షను గురియై ఎంతయో బాధపడవలసివచ్చును.

ఈ ప్రపంచయుద్ధసమయములోనే బానిసత్వముచే అల్లాడు అనేకరాజ్యములు స్వతంత్రరాజ్యములుగా ఏర్పడినవి. కొన్నివందల సంవత్సరములనుండి బానిసత్వముచే బాధపడుచున్న ఐర్లండు డీవేలరా నాయకత్వమున ఈయుద్ధసమయములోనే తీవ్రాందోళనచేసి స్వతంత్రత పొందగలిగెను. ప్రపంచమునంతకును నేడు గొప్ప ఆదర్శమై, సామ్యవాదప్రభుత్వమును దిగ్విజయముగా సాగించుచున్నట్టి రష్యాదేశములో ఈ ప్రపంచయుద్ధసమయములోనే జారుప్రభుత్వధ్వంసము, సామ్యవాదప్రభుత్వస్థాపన జరిగెను. ఈ సమయమునందే నవ్యటర్కీయోద్ధారకుడగు ముస్తఫాకెమాల్ పాషా నాయకత్వము టర్కీదేశములో స్థిరపడిపోయినది. ఈ సమయము కనిపెట్టి మహాత్మాగాంధీ భారతదేశమునకుకూడ స్వాతంత్ర్యము లభించునని ఆశించి, బ్రిటిషువారికి సహాయముచేసెను. కాని మహాత్ముని మనోరథము విఫలమాయెను. ఈ ప్రపంచాందోళన గ్రహించి జెకోస్లోవేకియా స్వాతంత్ర్యమును పొందుటకు ఇదేసమయమని గ్రహించినవారిలో ప్రెసిడెంటు మాజరిక్ ఒకడు.

ఈ ప్రపంచయుద్ధము జరుగు నాలుగేండ్లలోను డీవేలరావలెనే మాజరిక్ విదేశములలో సంచారముచేసి, జెకోస్లోవేకియా స్వాతం

త్ర్యమును విదేశీయులందరు గుర్తించునటుల జేసి, జెకోస్లావేకియా యనిన వారికి సానుభూతి కలుగునట్లుచేసెను. ఇంతియకాక ప్రతి దేశములోని రాజకీయవేత్తలతోను తనదేశ దుస్థితినిగురించి మాట్లాడి భావికార్యక్రమమును నిర్ణయించుకొని పత్రికలలో అనేకవ్యాసములను వ్రాసి, ప్రజలలో తీవ్రప్రచారము చేయమొదలిడెను. ఆస్ట్రియా, హంగేరీ ప్రభుత్వములు తమదేశమునకు సంపూర్ణస్వాతంత్ర్యము నిచ్చువరకు దేశములో శాంతి భద్రత ఏర్పడదని నిష్కర్షగా చెప్పగలిగెను. ఈయనకు ఈస్వాతంత్ర్యోద్యమములో నేటి ప్రెసిడెంటుయైన "డా॥ బెనిస్" నేటి సైనికశాఖామంత్రియైన "స్టీఫినిక్" అను ఇద్దరు యువకులు ఎక్కువగా సహాయపడిరి.

మాజరిక్ ప్రజలలో ఎక్కువగా ఉపన్యాసములిచ్చి తీవ్రాందోళనచేయుటచే ప్రభుత్వమువారి ఆగ్రహమునకుగురియై అనేకబాధలకు లోనయ్యెను. ఈయనయొక్క విదేశప్రచారము ఆస్ట్రియా-హంగేరీ, జర్మనీ, ప్రభుత్వములకు చాలకంటకముగా నుండి, ఈయనను అరికట్టు నుద్దేశముతో మాజరిక్ నేగాక ఈయన కుటుంబమునంతను అనేకబాధలు పెట్టి కష్టపెట్టెడివారు. మాజరిక్ ను స్వదేశమునకు రానీయకుండ విదేశములలోనే ఆయనను బాధపెట్టెడివారు. మాజరిక్ మనస్సు త్రిప్పుటకు ప్రభుత్వమువారు అనేకమగు దొంగ ప్రచురణలను ప్రచురించుచుండెడివారు. మాజరిక్ ప్రభుత్వము పెట్టుబాధలకు ఏమాత్రము భయపడక వాటిని ప్రతిఘటించి తాను తన దేశస్వాతంత్ర్యము మాట మరువక స్వాతంత్ర్యసమరమును మరింత ఉత్సాహముతో నడుపసాగెను.

కాని; మాజరిక్ ఎంతటి ఓర్పుతోనున్నను ప్రభుత్వమువారిదుండగము అధికమగుటచే, "థామస్ జార్జి మార్డిసన్" అను మారు

అమెరికానుండి జెకోస్లావాకియాకు బయలుదేరెను. మాజరికు జెకోస్లావాకియా వచ్చినవెంటనే ప్రజలు ఆయనపై పుష్పవర్షము గురియించిరి. ఎన్నో విధముల పొగడిరి. మాజరికును జెకోస్లావాకియా ప్రజలు జీవితాంతమువరకు అధ్యక్షునిగా యుండవలసినదని కోరిరి. ప్రజలు తనయందు అభిమానముచే కోరిన ఈకోరికను తాను తిరస్కరించలేక అంగీకరించి యెంతో చక్కగా పరిపాలన చేయగలిగెను.

మాజరిక్ అధ్యక్షపదవిని స్వీకరించుసరికి ౮౫ ఏండ్ల వృద్ధుడు. అయినను గొప్ప శక్తిసామర్థ్యములతో ౧౫ ఏండ్లు నిరుపమానముగ పరిపాలన జేయగలిగెను. మాజరిక్ దేశమునకు చేసిన సేవకును, ప్రజామోదకరమగు పాలనకును, దైవభక్తి వేదాంతగోష్ఠి మొదలగు సుగుణసంపత్తికిని ఈయనకు దేశము "రాజర్షి" అను బిరుదము నిచ్చెను. ఇటువంటి రాజర్షియైన మాజరిక్ మహనీయుడు వృద్ధుడగుటచే, ౧౯౩౫ డిసంబరు ౧౪ వ తేదీని తన అధ్యక్షపదవికి రాజీనామా నిచ్చి రాజ్యపాలనా భారవిముక్తుడై విశ్రాంతి గైకొనెను. రష్యా దేశస్థులు తమ నాయకుడైన లెనిన్‌ను ఏవిధముగా నేటికిని కొల్చెదరో, మాజరిక్‌ను జెకోస్లోవాకియా ప్రజలు నేటికిని అలాగుననే గౌరవించెదరు.

మాజరిక్ వ్రాసిన "సంస్థానము స్థాపించుట ఎట్లు?" గ్రంథము ఈయన శక్తి సామర్థ్యములను తెలియజేయును. జెకోస్లావాకియా భాగ్యవిధాతయు, రాజర్షియును, అపూర్వ మేధా సంపన్నుడును యగు మాజరిక్ ౮౭ సంవత్సరములు జీవించి ౧౯౩౭ సెప్టెంబరు ౧౪ తేదీని తన దేశీయులను దుఃఖసాగరమున ముంచి స్వర్గస్థుడయ్యెను.

మాజరిక్ తన అధ్యక్షపదవికి రాజీనామానిచ్చిన తరువాత, యీయన గౌరవార్థము జెకోస్లావాకియా ప్రభుత్వము ఈయనకు సంవత్సరమునకు రూ. 1,00,000 లు ఇచ్చుచుండెడిది.

ఎచ్చటనో మూలనుండిపోయి చీలిపోయిన దేశములను కలిపి వానికి సంపూర్ణ స్వాతంత్ర్యము లభింపజేయగలిగిన మహాత్ముడు మాజినీ చనిపోయినపుడు, పరితపించని వ్యక్తి; చింతించని దేశము కూడ లేదు.

నేడు మన భారతదేశములో మాజినీతో సరిపోల్చదగిన వ్యక్తి ఒక్క గాంధిమహాత్ముడు తప్ప మరెవ్వరును లేరనియే చెప్పవచ్చును. దీనినే గాంధిగారి కార్యదర్శి మహాదేవ దేశాయిగారిట్లు చెప్పిరి.

“మేధాశక్తిలోను, భాషావైశిష్ట్యమునందును గాంధీమాజినీలొకరినొకరు తీసిపోరు. మాజినీ గాంధీలు ఉభయులు వేదాంతులే. త్యాగములో ఒకరినిమించినవారొకరు. మాజినీ గాంధీలు ఎప్పుడు కూడ స్వార్థము లేని కార్యదీక్షాపరులు. వీరిద్దరును ప్రతినిమిషము పని యుండిన గాని యుండలేరు. సోమరిపోతులనిన వీరిద్దరికిని గిట్టదు. పనియే మాజినీ గాంధీలను వెదకుకొని వచ్చును గాని వీరుపనిని వెదకుకొనరు. ఉభయులును ఎప్పుడును చేతిలో పైసాలేకపోయినను అవసరసమయమునకు వేలకువేలు తేగల సమర్థులు. రాజకీయములలో నీతికూడ యుండవలెనని గ్రహించినవారు మాజినీ గాంధీలు. వీరుభయులు అహింసాపరులు, సత్యవ్రతులు, ప్రజాస్వామ్యపరిపాలనా కాంక్షితులే గాక, ఎల్లప్పుడును జాతీయతకు పోరాడు స్వాతంత్ర్యయోధులు.”

ఈవిధముగా ప్రపంచవిఖ్యాతి గాంచిన ప్రసిద్ధుడగు మాజినీకి మన మహాత్మాగాంధియే సాటిగాని, మరెవ్వరును సాటిలేరని గట్టిగా చెప్పవచ్చును.

---

ఏకగ్రీవ

మాజినీ తనదే

...హూతా ప్రెస్, 39. ఆండర్సన్ వీధి, మద్రాసు.